# ప్రకాశకుల మనవి



శ్రీభగవద్గీతాగర్భిత భావబోధిని 1903 సం॥లో మొదట ప్రచురమైనది. తిరిగి ఏబదిఆరు సంవత్సరములకు ద్వితీయముద్రణము, సహృదయులు అనేకులు కోరుటవలన ప్రచురించుచున్నాము. భగవద్గీతకు ఎన్నో వ్యాఖ్యానములు, వివరణములును ఉన్నవి. అయితే ఈభావబోధినిలో ప్రత్యేకమైన విశేషత పాఠకులు గీతాభక్తులు గమనింపగలరు. ముముక్షువుల కత్యంతోపయుక్తమగునటుల శ్రీ కోకా వేంకటరామానుజులనాయనింగారు ఎన్నో గ్రంథములు పరిశోధించి ఇది రచించినారు.

శ్రీనాయనింగారు ఆదివెలమ కులమున జనించినారు. తండ్రి సీతయ్య. తల్లి రమణాంబ. గురువు కాండూరి తిరువేంగడాచార్యులు. నాయనింగారు కవి. గజేంద్రాఖ్యానచరిత్ర యక్షగానము రచించినారు. ఇది హరికథారూపముననున్న చక్కనిరచన. వీరు పోలీసు ఫస్టుక్లాసు ఇనస్పెక్టరుగపనిచేసిరి. వీరి విజ్ఞానమునకు ఈగీతాగర్భిత భావబోధిని తార్కాణ.

ఈ పెండెనకూర్పులో వీరు ఉదహరించిన ఇతరగ్రంథముల పద్యములలోగ సంఖ్యలుకూడ చేర్చినాము. గీతాభక్తులు ఈగ్రంథమును ఆదరించి నాయనింగారి పరిశ్రమను సార్థకపరచి, మాకు ప్రోత్సాహము కలిగింతురని నమ్ముచున్నాము.

ఈ ద్వితీయముద్రణలో గ్రంథము సాంతముగ పరిశీలించి సవరణలు చేసి ఇచ్చిన శ్రీ పురిపండా అప్పలస్వామిగారికి కృతజ్ఞులము.

రాజమండ్రి
సరస్వతీ పవర్ ప్రెస్
1—2—59

అద్దేపల్లి నాగేశ్వరరావు
ప్రకాశకుడు

# విజ్ఞాపనము

ఇహలోకమునఁ గొందఱు జీవనముకొఱకును, మఱికొందఱు కీర్తి ప్రతిష్ఠలకొఱకును, నిట్లనేకు లనేకవిధములగు విద్యల నేర్చుచున్నారు. గదా, (కోటివిద్యలనేర్చుట కూటికొఱకె) అనున ట్లావిద్యలన్నియు క్షణభంగురమగు నిహలోక సౌఖ్యమునకు మాత్రమే యుపయోగించు చున్నవిగాని పరలోకసౌఖ్యమున కుపయోగించునవికావు. కాఁబట్టి బుద్ధిమంతుఁడగు ప్రతివాఁడును, ఈవిద్యలెన్ని నేర్చినను నేరకున్నను పరలోకసౌఖ్యమున కుపయోగించెడు విద్యనుమాత్రము నేర్వవలసినది యత్యావశ్యకముగనున్నది. అందుకుపయోగించెడుగ్రంథములన్నిటిలో శ్రేష్ఠమైనది యేదియని పర్యాలోచించిచూడఁగా' శ్రీభగవద్గీతా శాస్త్రము సమస్తవేదాంతసారసంగ్రహమైనదిగను, సర్వమత సమ్మతమైనదిగను, సకలవర్ణాశ్రమాచారధర్మముల కనుకూల్యమైనదిగను, ఉత్కృష్టోత్తమమైనదిగను, నున్నట్లగపడుచున్నది. కాన యీగీతాశాస్త్రమునందఱును బఠించి దానియందు నిగూఢమై యుండెడు నర్థమును జక్కఁగఁ దెలిసికొనుట యత్యావశ్యకమైయున్నది.

అయితే, యీగీతాశాస్త్రము పుట్టి యిప్పటికి వేలకొలఁది సంవత్సరములు కడచినను, బ్రాహ్మణులు మట్టుకుఁ బఠింపుచుఁ దదితరులకుఁ బఠనయోగ్యముకాదని మరుఁగుపఱచి యుంచఁబడినందున నింతకాల మిప్పటివఱకె నందఱకును వెల్లడి కాకయుండిన ట్లగపడుచున్నది. ఇట్లు గోప్యముగనుంచఁబడుటవలన బ్రాహ్మణులలోనైనను విద్యావివేకసంపన్నులగు కొందఱుమాత్రమే యీయుత్కృష్టగ్రంథమును బఠింపుచుండిరనియు, తదితరు లిట్టి గ్రంథమున్నదనికూడ నెఱిఁగి యుండరనియు నూహింపఁదగియున్నది.

ఇటీవల ననసూయాపరులగు కొందఱు బ్రాహ్మణోత్తములు ముముక్షువుల కత్యంతోపయుక్తమగు నీయుద్గ్రంథమును నన్ని వర్ణా

శ్రమాచారములవారును బఠించి కడతేరఁదగినవారుగ నుంచుచున్నారని యెంచి యీశాస్త్రమును టీకాసహితముగ ముద్రింపించి ప్రచురము చేయ నారంభించిరి. అందువలన నీశాస్త్రమును బ్రాహ్మణక్షత్రియులే గాక తదితరవర్ణస్థులుగూడ జదువుటకును, దానియందలి స్వారస్యమును బూర్తిగఁ గాకున్నను గొంతమట్టునకైన గ్రహించుటకును నవకాశముగలిగెను.

ఇట్లుండ శ్రీమాన్ పణ్డిత లక్ష్మణాచార్యులవారు మొదలగు పండితోత్తములు కొందఱీ గ్రంథమునందలి స్వారస్యము నచ్చుపుస్తకములలో నుండెడు ప్రతిపదటీకాతాత్పర్యసంగ్రహములవలన నందఱును జక్కఁగ గ్రహింపఁజాలరనియెంచి దానియందలి స్వారస్యమునందఱికిని దేటతెల్లముగఁబోధపడునట్లుపన్యాసరూపముగబోధింప సమకట్టి యట్లు చేయుచున్నారు. అందువలన నీగీతాశాస్త్ర మిదివఱకు నెఱిఁగియుండినవారల కిప్పుడు దానియందలి రుచి యభివృద్ధినొందుటకును, ఈశాస్త్రము నిదివఱ కెఱుఁగని మఱికొందఱ కిప్పుడు దీనియందభిరుచి నూతనముగఁ గలుగుటకును గారణమైనది.

ఇదివఱ కింతగోప్యముగ నుంచఁబడిన యీయుద్గ్రంథము నిప్పుడిట్లు వెల్లడిపఱప సమకట్టిన యీమహనీయుల యుద్యమ మట్లున్నదనఁగా, పూర్వ మతిగోప్యముగ నుంచవలసినదని గురువుచే నుపదేశింపఁబడిన తిరుమంత్రమంత్రార్థములను సకలజనులును గ్రహించి యుజ్జీవింపవలెననెడి యుద్దేశ్యముతోనాచార్యాజ్ఞోల్లంఘనదోషమునకు వెరువక గోపురమునెక్కి చాటించిన యాదిశేషాంశసంభూతుఁడగు శ్రీరామానుజాచార్యులవారి యుద్యమమువంటిదై యున్నది.

ఇట్లింతమంది పండితోత్తము లిన్నివిధంబుల నీయుద్గ్రంథంబును బ్రచురింపుచుండ నిట్టిసమయమునఁ గించిజ్ఞుండనగు నేనును నీగ్రంథమును బ్రచురింపఁబూనుటకుఁ గారణమేమనఁగా, ఇదివఱకుఁ బండితులచేఁ బ్రచురములై ముద్రింపఁబడియుండు గ్రంథములలోని కొన్నికొన్ని [illegible]ములును, కొన్నికొన్ని శ్లోకములయొక్క పూర్వోత్తర సందర్భ

ములున్నను, నాబోటి పామరులకు సులభముగ బోధపడఁదగియుండక పోవుటవలనను, అట్టివిషయములన్నియు శ్రీమాన్ పండిత లక్ష్మణాచార్యుల వారిని మొదలగుపండితుల యుపన్యాసములవలనఁ దెలిసికొనఁ దగియున్నప్పటికిని యుండిసను చెన్నపురీనివాసులుగనుండి వారియుపన్యాసములను వినుచుండెడువారికేగాని తదితరులకు సుబోధాప్రాప్తి లేకుండుటవలనను, ఈభగవద్గీతయందలి యంశములన్నియు శ్రీభారత భాగవతాదిగ్రంథములలోఁ దెనుఁగున బద్యరూపముగ విపులపఱుపఁబడి యున్నట్టివగుటచేతను, అట్టిపద్యములలో నీగీతాశాస్త్రమునందలి యేయే శ్లోకములకు యేపద్యము సంబంధపడియుంచున్నదో, ఆయా శ్లోకము క్రింద నాపద్యము నుదహరింపుచు శ్రీకృష్ణార్జునులయొక్క సంభాషణరూపముగ సులభశైలితో దృష్టాంత దార్ష్ట్రాంత సహితముగ వ్రాయఁబడినయెడల నందలి ప్రతిశ్లోకముయొక్క స్వారస్యమును, పూర్వోత్తరసందర్భమును, పండితులకువలెనే పామరులకుఁగూడ సుఖకరముగబోధ కాఁదగియుండునని యెంచి యిట్టి ప్రయత్నమునకుఁబూనికొనినవాఁడనైతిని. అయితే, ఇట్లువ్రాయుటలో నచ్చటచ్చట నాయా సందర్భానుసారముగఁ బద్యాదులనేర్పఱచి యిందుఁబొందుపఱచి పూర్వోత్తరసంగతి సందర్భానుసారముగ సంభాషణరూపమున నల్లఁ గలిగినను, నేను బాల్యమునఁజదివిన సంస్కృతాంధ్రవ్యాకరణాదుల యందలిజ్ఞానముచాలవఱకుఁ బూర్వపక్షమైయుండుటంజేసి యట్టిలోపములులేక యుండునట్లు వ్రాయనేట్లగునని శంకించుచుండ, నాకత్యంతహితులును, ఇచ్చటిరాజకీయబాలికాపాఠశాలా ప్రధానోపాధ్యాయులును, సంస్కృతాంధ్రభాషలయందుఁ బండితులునగు బ్రహ్మశ్రీ నేలమూతల - శివరామశాస్త్రులవారిట్టి నాయుద్యమమునకు హర్షించినవారై యట్టి వ్యాకరణాదిలోపములు లేకుండునట్లు సవరించుటకుఁ బూనుకొనిరి. అందువైని నేనుధైర్యముతో నిట్టి ప్రయత్నమునకుఁ బూనికొన సాహసించితిని.

కించిజ్జ్ఞుఁడనగునాకుఁ గలిగియుండు స్వల్పపాండిత్యముతోడ నిట్టిగొప్పప్రయత్నమునకుఁబూనుకొని సాహసించుట యెట్లున్నదనఁగా. ఒకచిన్న తెప్పకొయ్య సహాయముతో మహాసముద్రమున [illegible] వెళ్ళినవాని సాహసమువంటిదై యున్నది. అయితే, అట్టిసమగ్రశక్తి లేనివాఁ డిట్టి గొప్పప్రయత్నమునకుఁబూనుకొనుటకుఁ గారణమేమనిన [illegible] నకొక దృష్టాంతముగలదు. అదెట్లనఁగా, పూర్వము శ్రీరాములవారు డెబ్బదిరెండువెల్లువల వానరసైన్యముచే గొప్పపర్వతములను [illegible] తెప్పించి సముద్రమునకు సేతువుగట్టించునపుడు సమయమున నొకయుడుత తానును వారలకునా సేతుబంధన విషయమున సహాయముచేయఁదలఁచి సముద్రతీరపు నిసుకలోఁబొర్లాడుచుఁ దనయొంటనంటిన యిసుకనంతయు నారాళ్ళమధ్యనుండు సందులను బూడ్చుటకుఁ గాలివలెఁ బరుగిడుచుండె ననియు, ఇట్టిదానియుద్యమమునుజూచి శ్రీరాములవారు సంతుష్టాంతరంగులై దానిని దన తిరుహస్తముతో నిమిరి యాశీర్వదించిరనియు, వినుచున్నాముగదా? అట్లే, యీ నాప్రయత్నముగూడ నిదివఱకుఁ బండితోత్తములచే ననేకవిధములుగఁ బ్రచురింపఁబడియుండు గీతాతాత్పర్యములను జదువువారల కిదియును గొంతసహకారిగ నుండుననియెడు నమ్మకముతోఁ జేయఁబడినదై యుంచున్నది.

మఱియును దచ్చటచ్చటఁ బూర్వోత్తరసందర్భానుసారముగఁ బొందుపఱుపఁబడియుండు విషయములు శ్రీభగవదనుగ్రహముచే నాబుద్ధికిఁ స్ఫురించినంతమట్టునకు వ్రాయఁబడి యున్నవిగాని, నాస్వప్రయోజకత్వముచే వ్రాయఁబడినవికావు. కాన నిట్టి నాయుద్యమమును గుఱించి యనసూయాపరులను దురభిమానరహితులునగు పండితోత్తములు హర్షించి హంసక్షీరోదకన్యాయమున నిందలి యొప్పుల గ్రహించి తప్పుల క్షమింతురని నమ్ముచున్నాఁడను.

ఇట్లు

సుజనవిధేయుఁడు

కోకా వేంకటరామానుజులు నాయుడు



గ్రంథకర్త:

కోకా వేంకటరామానుజులు నాయుడుగారు

సీ. ఆది వెలమకులమందు కోకాసీత, యార్యునకును రమణాంబయందు
జన్మించు రామానుజ ప్రసిద్ధాఖ్యను, జెన్నొంది వైష్ణవ శ్రేష్ఠుఁడైన
కాండూరి యప్పళాఖండపండితపుత్రుఁ, డగు తిరువేంగడాహ్వాయునిశిష్యుఁ
డగుచు శ్రీపతి కటాక్షాసాదితంబగు, నుద్యోగమునమించి యోగ్యముగను
బనులనిర్వర్తించి పైయధికారుల, మెప్పించి పెన్షను నొప్పఁబడసి
నిగతకాలంబును భగవంతునెఱిఁగించు, గ్రంథాదులఁ బఠించి గడపఁదలచి
సకలవేదంబుల సారసంగ్రహమగు, శ్రీభగవద్గీత శ్రేయమనుచు
మునుకొనిచదువంగఁ బనిఁబూనినట్టినా, పూన్కికి దగునట్లు పూజ్యమైన
తచ్ఛాస్త్రమందునంతర్భూతమైయుండు పెక్కుగూఢార్థముల్ పెంపుమీఱ
మనికిఁదోఁపగ వాని మఱతునేమో యని, లిఖియింపఁబూని తల్లేఖనమును
ప్రచురింపనావంటి పామరజనులకు, నత్యుపయుక్తమే యౌనటంచుఁ
దలఁచి పూనితిఁగానఁ దప్పులెన్నక బుధుల్, సమ్మతింపఁగఁగోరి సవినయముగఁ

తే. ప్రార్థనముచేసివారల పాదధూళి, నైన నే దీని నర్పింతు నచ్యుతునకుఁ
బఠనయోగ్యంబుగా జనుల్ ప్రస్తుతింప, ధరణివర్ధిల్ల నాచంద్రతారకముగ.

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# శ్రీభగవద్గీతాగర్భిత భావబోధిని

## అవతారిక



"క॥ ధరణీభరముడుపుటకా ।
నరనారాయణులు భువిజ - ననమునయము నొం ।
దిరి యర్జునకృష్ణాఖ్యలఁ !
గురుయదువంశములసత్త్వ - గుణయుతులగుచున్ ॥"

అనునట్లు శ్రీభగవత్స్వరూపులగు నరనారాయణులు భూభారనివారణార్థమై దుష్టనిగ్రహ శిష్టపరిపాలనములఁ జేయుటకుఁగా నీభూలోకమున నరుఁడు భారతవంశమున నర్జునుఁడుగను, నారాయణుఁడు యాదవవంశమున శ్రీకృష్ణుఁడుగను, నవతరించిరి. అట్లవతరించిన కార్యములరెంటిలో మొదటిదియగు దుష్టనిగ్రహమును భారతయుద్ధమనెడు మిషమీఁద నిర్వర్తింపుచు నాసమయమునందే వారి రెండవ కార్యమగు శిష్టపరిపాలనమునుగూడఁ జేయనుద్దేశించినవారై, నరుఁడగు నర్జునుఁడు బంధుజనవధావిషయమునశోకాకులమానసుండై యుద్ధముఁజేయ నొల్లకుండినట్లును, అట్టి యర్జునునకు నారాయణుఁడగు శ్రీకృష్ణుఁడట్టిశోకమును మాన్పి యుద్ధమునకుఁబురికొల్ప సమకట్టి తత్త్వోపదేశముఁ జేసినట్లును వ్యాజముకల్పించుకొని యావ్యాజముచే లోకులుజీవించుటకుఁదగిన ప్రవృత్తినివృత్తిమార్గములరెంటిని దెల్లడిపఱచిరి.

అట్టిభగవద్వాక్యములను శ్రీమహాభారతప్రణేతయగు వ్యాసమహర్షి యేడువందల శ్లోకములుగల పదునెనిమిది యధ్యాయములుగఁ జేసెను. భగవంతుఁడగు శ్రీకృష్ణమూర్తిచే నుపదేశింపబడినవిషయములను గురించిన గ్రంథము గనుక దీనికి "భగవద్గీత" యను నామము గలిగెను. దీనికే గీతాశాస్త్రమనియెడు నామాంతరమును గలదు.

* ఈగీతాశాస్త్రమునందలి సారాంశమేమనగా.

ఈదృశ్యప్రపంచమంతయు నసత్పదార్థము, అనఁగా, నశింపఁదగినవస్తువు.

ఆత్మయొక్కటియే సత్పదార్థము అనఁగా నెప్పటికిని శాశ్వతముగానుండునట్టిది.

---

* ఈవిషయము శ్రీ కోయిల్ - ధనాల - దేవరాజాదాసులవారిచే రచింపఁబడిన భక్తవిజయముయొక్క అవతారికయందుఁ జక్కఁగ విపులపఱచఁబడియున్నది గాన దానిఁ జదివెడువారికి సుబోధము కాఁగలదు.

ఈయాత్మ, జీవాత్మయనియు, పరమాత్మయనియు రెండువిధములు గలదై గా నున్నది.

అందు జీవాత్మయనఁగా నజ్ఞానసహితమై ప్రపంచమునందలి సమస్తప్రాణులయందును వ్యాపించియుండెడు చైతన్యము. దీనికే, జీవము, జీవుఁడు, ప్రాణము, ఉసురు అని నామాంతరములుగలవు.

పరమాత్మయనఁగా, అవిద్యారహితమును, శుద్ధజ్ఞానానందస్వరూపమును, ప్రపంచోత్పత్తి స్థితి లయ కారణభూతమునునై యట్టిప్రపంచమునందు నిండియుండునట్టి చైతన్యము. ఇదియే, పరబ్రహ్మమనియు, త్రిమూర్త్యాత్మకమనియు, అనఁగా, సృష్ట్యాదివృత్తిభేదమునుబట్టి బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపుఁడనియుఁ జెప్పఁబడుచున్నది.

జీవాత్మ నావరించియుండెడు నజ్ఞాన మెప్పుడైతే విడిచిపోవుచున్నదో, అప్పుడాజీవాత్మయును శుద్ధజ్ఞానానందస్వరూపమై పరమాత్మలోఁ గలియును. అనఁగాఁ అజీవాత్మయును, పరమాత్మస్వరూపమునే పొంది జననమరణాదులు లేకయుండుననుట.

కాన నిందువలన నేమియేర్పడుచున్నదనఁగా, జీవాత్మయుఁ బరమాత్మయే యనియు, అనఁగాఁ బరమాత్మయొక్క యంశమేయనియు, అయితే యవస్థాభేదమువలనఁ బరమాత్మకంటె వేఱైనదై జననమరణాదివికారముల నొందుచుండుననియు, అట్టియవస్థాభేదమును విడిచినతోడనే యాపరమాత్మలోఁ గలియుచున్నదనియు నేర్పడుచున్నది.

ఇట్లగుటయే మోక్షమనియు, నిర్వాణమనియు, ముక్తియనియు, కైవల్యమనియు, అపవర్గమనియు, పరమపదమనియుఁగూడఁ జెప్పఁబడుచున్నది. ఇట్టి మోక్షమును బొందఁగోరెడువాఁడు ముముక్షువనఁబడును అట్టి ముముక్షువు నవలంబింపవలసిన మార్గము ప్రవృత్తియనియు, నివృత్తియనియు, రెండువిధములు గలదిగానున్నది. అందుఁ బ్రవృత్తిమార్గమనఁగా మనోబుద్ధీంద్రియ నిగ్రహముగలిగి, రాగద్వేషరహితుఁడును, ద్వంద్వసహిష్ణుఁడును, నిరపేక్షకుఁడును, నిర్మమాహంకారుండునై, తనకులాచారధర్మములగు సమస్త నిత్యనైమిత్తికకర్మలను విధ్యుక్తముగ నాచరించుచు నట్టికర్మలఫలము నపేక్షింపక భగవదర్పితముసేయుచు, చిత్తము నాభగవంతునియందే చేర్చి సదా తత్పరుఁడై యుండుట. దీనికే యోగమనియు, కర్మయోగమనియు, నిష్కామకర్మయోగమనియు నామాంతరములుగలవు. నివృత్తిమార్గమనఁగా, పైనఁ బ్రవృత్తిమార్గమునకుఁ జెప్పఁబడినలక్షణములుగలవాఁడును, సద్బ్రహ్మజ్ఞానవైరాగ్యములుగలవాఁడును ఆత్మానాత్మవివేకియునై సమస్తకర్మలు సన్యసించి చిత్తమును సదానిర్వికల్పసమాధియందునిల్పి యాత్మానుభవముఁ జేయుచుం

డుట తప్పఁ దదితరములగు నేవ్యాపారములయందును త్రికరణములచేఁ బ్రవర్తింపకుండుట. దీనికే సాంఖ్యమనియు, సన్న్యాసమనియు, యత్యాశ్రమమనియు, నైష్కర్మ్యమనియు, జ్ఞానయోగమనియు, నామాంతరములుగలవు.

ఈప్రవృత్తి నివృత్తిమార్గముల రెంటిలో మొదటిదియగు ప్రవృత్తిమార్గమే, అనఁగా నిష్కామకర్మయోగమే యీగీతాశాస్త్రమందంతటను ముఖ్యముగానూఁది చెప్పబడియున్నది. ఇట్లు చెప్పుటవలన నీగీతాశాస్త్రోపదేష్టయగు శ్రీకృష్ణభగవానులయుద్దేశ్య మేమిగానుండవచ్చునని యోచింపఁగా నీక్రిందఁ బొందుపఱపఁబడిన విషయముల బుద్ధికి స్ఫురింపుచున్నవి. అవి యెవ్వియనగా,—

ఈజీవాత్మపరమాత్మలయొక్క తత్త్వముఁ యథార్థత ఇట్టిదని నిస్సంశయముగ నెఱుఁగుట యేదిగలదో, అట్టి యెఱుకయే జ్ఞానమనఁబడును.

అట్టిజ్ఞానము నెవఁడైతే పొందుచున్నాఁడో వాఁడే దేశస్థుఁడైననుసరే, ఏమతస్థుఁడైననుసరే, ఏకులస్థుఁడైననుసరే, అట్టివాఁడే మోక్షార్హుఁడగును. అనఁగా, వానియందలి జీవాత్మ తన్నంటియుండెడు నజ్ఞానము నశించిపరమాత్మలోఁ గలియుటకునర్హమైనదగును. కాన నట్టిజ్ఞానసిద్ధిని బొందఁగోరెడివాఁడు ముముక్షు వనఁబడును. అట్టి ముముక్షువు పైఁజెప్పబడిన రెండుమార్గములలో మొదటిదియగు ప్రవృత్తిమార్గము నవలంబించి నిష్కామకర్మము నాచరించుచువచ్చినయెడలఁ గొంతకాలమునకు జ్ఞానోదయము గాఁగలదు. అట్టిజ్ఞానోదయ మెప్పుడగుచున్నదో యప్పుడు వాఁడు జ్ఞానియనియు, బ్రహ్మవిదుఁడనియుఁ జెప్పబడును. అట్టిజ్ఞానసిద్ధిని బడసినపిమ్మట వైరాగ్యమంకురించి నివృత్తిమార్గము నవలంబించుట కర్హుఁడు గాఁగలడు. అయితే, అట్లు వైరాగ్య మంకురించినవెంటనే నివృత్తిమార్గము నవలంబించినయెడల నది తుదముట్టనిగ్గించుట కష్టసాధ్యమగును. ఏలయనఁగా

"తే॥ గీ॥ జ్ఞానవిజ్ఞానయుతుఁడయ్యు సంతతంబు
నాత్మభావనలేకున్న యతని యింద్రి
యంబులు మనంబు తమకు వశంబుచేసి
విషయసుఖముల చవిఁజూపి వెతలఁబెట్టు॥" (సీ–రా–3 ఆ. ౧౮౧)

అనునట్లు, ఆ జ్ఞానవైరాగ్యములు చక్కఁగ మనస్సునఁ బాదుకొనకమునుపే నివృత్తిమార్గము (అనఁగా సర్వకర్మపరిత్యాగము) నవలంబించినయెడల నొకానొకప్పుడు బలిష్ఠములైన యింద్రియములచేఁ జిత్తముచలింపఁ జేయబడుచుండును గాన నిర్విఘ్నముగ నెఱవేఱుట కష్టసాధ్యమగును. అదెట్లనఁగా నెవఁడైన నొకపద్యమును గంఠపాఠముచేయఁ దలఁచి దానిం గొన్నిపర్యాయములు చదివినయెడల ముఖస్థమగుచున్నదిగదా? అట్లు ముఖస్థమైనవెంటనే దానిని మరలఁజదువకుండినయెడల నదిమరల

శీఘ్రముగనే పూర్వపక్షమగుటయుఁగలదుగదా ! అట్లుగాక సుస్థిరమైనంతకుఁ గూడదానినిగొంత కాలమువఱకు విడువక యెప్పుడెప్పుడు సమయమువచ్చినయెడల నది మనస్సునఁ జక్కఁగ నాటినదై యావలఁ జదువక పోయినను మఱవఁబడక సుస్థిరము గనే యుండునుగదా ? కాన నట్లే యీజ్ఞానవైరాగ్యములనభ్యసించినప్పటికిఁగూడఁ గొంత కాలమువఱకు వానియుత్పత్తి కారణమగు ప్రవృత్తిమార్గమునే యవలంబించుచు వచ్చినయెడల నదివానిమనస్సునఁ జక్కఁగఁబాదుకొని స్థిరపడును. అట్టియప్పుడు వానిమనస్సును నింద్రియవిషయాదులు చలింపఁజేయఁజాలవు. కాఁబట్టి యట్టివాఁడు బ్రహ్మవిద్వరుఁడనబడును. అట్టివాఁడే నివృత్తిమార్గమవలంబించుట కర్హుఁడగును. అటుపిమ్మట వానిజ్ఞానవైరాగ్యములు మఱియు హెచ్చుచుండఁగ వాఁడు క్రమక్రమముగ బ్రహ్మవిద్వరీయుఁడనియు బ్రహ్మవిద్వరిష్ఠుఁడనియుఁ జెప్పఁబడును. ఎప్పుడు బ్రహ్మవిద్వరిష్ఠుఁడెప్పుడగుచున్నాఁడో, అప్పు డతఁడు జీవన్ముక్తుఁడనఁబడును. అతని యందుండెడు జీవాత్మ పాంచభౌతిక దేహస్థమైయుండియుఁ బరమాత్మస్వరూపముగనే ప్రకాశించుచుండును. అట్టి యతని జీవాత్మయెప్పుడు దేహమును విడుచుచున్నదో అప్పుడు పరమాత్మలోఁగలియును. కాన నట్టికలియుటయే విదేహముక్తియనఁబడును.

ఈపైఁజెప్పబడిన బ్రహ్మవిదునియొక్కయు, బ్రహ్మవిద్వరునియొక్కయు, బ్రహ్మవిద్వరీయునియొక్కయు, బ్రహ్మవిద్వరిష్ఠునియొక్కయు, లక్షణములు "సీతా రామాంజనేయసంవాదము" అనెడు వేదాంతగ్రంథమునఁ జక్కఁగ వివరింపఁబడి యున్నది. అదెట్లనఁగా.

"వ॥ బ్రహ్మవిదుఁడు బ్రహ్మవిద్వరుఁడు, బ్రహ్మవిద్వరీయుండు. బ్రహ్మవిద్వరిష్ఠుండనఁ దత్త్వజ్ఞులు నలువురుగలరు. అందు దేహేంద్రియాదికర్తృత్వంబును గర్మఫలకాంక్షయు లేక నిత్యనైమిత్తికంబులైన యజ్ఞదాన తపఃప్రముఖవైదికకర్మంబుల యథావిధిగా నాచరించుచుఁ గామ్యకర్మంబులవిడిచి శాస్త్రగర్హితంబులుగాని లౌకికకర్మంబుల యథోచితంబుగా నొనర్చుచుఁ బుత్రమిత్రకళత్ర విత్తక్షేత్రాదుల యందు వైరాగ్యంబుగలిగి యదృచ్ఛాలాభ సంతుష్టుండుఁ గామ రాగ ద్వేష భయ లోభ మోహ మదమత్సరాది నానావిధచిత్తవికారరహితుండు సతతవిజిత శరీరేంద్రియ ప్రాణాంతఃకరణుండు నిరహంకారుఁడు నిత్యప్రసన్నచిత్తుండుఁ బరమ కారుణికుండుఁ బరమశాంతుండు జ్ఞానవిజ్ఞానసంపన్నుండు నంతస్సుఖుండు నంతరారాముండు నంతఃప్రకాశుండు నాత్మరతుండు నాత్మతృప్తుండు నాత్మసంతుష్టుండునై సంచరించు నతండు బ్రహ్మవిదుండు మఱియును సకలవైదికలౌకికకర్మంబుల విధిపూర్వకంబుగా సన్న్యసించి పూర్వోక్తలక్షణంబుల విలసిల్లి సంప్రాప్తదుఃఖంబుల ద్వేషింపక నివృత్త సుఖంబులఁగోరక ప్రకాశప్రవృత్తిమోహంబుల నుదాసీనుని చందంబునఁ జూచుచు

సుఖదుఃఖమోహాది కార్యాకార్య గుణంబులయందుఁ జిత్తేంద్రియాదిద్వార కారణ గుణంబులు ప్రవర్తించుచుండ వానిచేతం జలింపఁజేయఁబడక నిశ్చలుండై సమదుఃఖ సుఖుండు స్వస్థుండు సమలోష్టాశ్మకాంచనుండుఁ దుల్యప్రియాప్రియుండుఁ దుల్యనిందాస్తోత్రుఁడుఁ దుల్యమానావమానుఁడుఁ దుల్యశత్రుమిత్రపక్షుండు సంపరిత్యక్తసర్వారంభుండునగు గుణాతీతుఁడు బ్రహ్మవిద్వరుండనందగు. మున్నువివరించినగుణంబులన్నియుఁ బ్రకాశించుచుండ సంతతసహజామానస్క రాజయోగనిష్ఠాగరిష్ఠుండైయెడనెడఁ బరులవలన మేలుకొల్పఁబడి కించిదాహారంబుఁ గొనుచుసుప్తుండైనవాని తెఱంగున విశ్వంబు మఱచియుండునతండు బ్రహ్మవిద్వరీయుండు. తనవలన నొరులవలనఁబునరుత్థానంబులేక బాహ్యాభ్యంతరంబులుమఱచి నిరంతర నిర్వికల్ప సమాధినిష్ఠుండై పరిపూర్ణప్రత్యగభిన్న పరబ్రహ్మచైతన్యప్రకాశమాత్రుండై వెలుఁగునతండు బ్రహ్మవిద్వరిష్ఠుం డనదగు. అందు మొదలిరువురకు బ్రారబ్ధంబుదోఁచియు మిథ్యాభూతంబై యుండు. వరీయునందుఁగలిగియు లేకుండు. వరిష్ఠున కేమాత్రంబు లేదు.'' (సీ-రా-3-అ. ౧౧౪)

దీనింబట్టి యేర్పడియెడుసారాంశమేమనగా, ముముక్షువు లవలంబింపవలసినది ప్రవృత్తి-నివృత్తి-యనెడుమార్గంబులు రెండనియు, అందుముందుగఁ బ్రవృత్తిమార్గం బవలంబించి సాంగోపాంగంబుగ దుదముట్ట నాచరించిననేగాని నివృత్తిమార్గంబు నవలంబింపవీలుపడదనియు, కాబట్టి నివృత్తిమార్గమునకుఁ బ్రవృత్తిమార్గము సాధకముగ నున్నదనియు నేర్పడుచున్నది.

ఇట్లుండ నీలోకంబున ముముక్షువులలో సకృత్తుగ నొకానొకఁడు-అనఁగా-వేయింటనొకఁడు మాత్ర మిట్టి క్రమంబగుపద్ధతి నవలంబించి నైష్కర్మ్యసిద్ధిని (సంపూర్ణ జ్ఞానవైరాగ్యసిద్ధిని) బొంది పిమ్మట సన్న్యసించినవాఁడై క్రమక్రమముగఁ బండిన యోగసిద్ధిగలవాఁడై మోక్షార్హుఁడగుచున్నాఁడు. తక్కినవారలు ,

'' తే॥ కొంద ఱాత్మతత్త్వము నెఱుంగుదు మటంచు
గర్వులై నిక్కి చిత్తనిగ్రహము లేమి।
నుపరతిసుఖంబుగానక విపులవిషయ
రాగలోలతం జెడుదు దూరక మహాత్మ ! ॥'' సీ-రా-3-అ.౧౮౪

అనునట్లు, అట్టినైష్కర్మ్యసిద్ధినిబొందకమునుపే, అనఁగా, సంపూర్ణజ్ఞానవైరాగ్యసిద్ధిని బొందకమునుపే మోక్షాపేక్షచే నాతురపడిగాని, లేక, యేదేనియొక గృహచ్ఛిద్రముచే నప్పటికిఁదోఁచెడు విరక్తిచేఁగాని సన్న్యసించినవాఁడై యట్టి సన్న్యాసాశ్రమమునందుఁ జిత్తమును స్థిరముగ నిలుపఁజాలక భ్రష్టులై యిహపరములకు రెంటికిని జెడుచున్నారు.

ఇదియెట్లున్నదనఁగా అనుభవార్హమైన యొకఫలము మొదటఁ బింజెయై యాపింజె యెండవడకుఁగాని గాలిదెబ్బకుగాని పడలి రాలిపోకుండునట్లు కాపాడఁబడినయెడలఁ గాయయగుచున్నదిగదా, ఆ కాయకు మిడుతపోటు, చిలుకపోటు, ఉడుతపోటు మొదలగుబాధలు కలుగకుండునటులఁ గాపాడఁబడినయెడఁ జక్కఁగా ముదిరి పలకవారి, అనఁగా, పండుటకుఁ బరిపక్వమై తనంతటనూడి చెట్టునుండి క్రిందఁబడుటకు సిద్ధమగుచున్నదిగదా. అట్టిసమయమందా దోరగిలినకాయను క్రిందఁబడకుండఁగోసి మాఁగవేసినయెడల నది కొద్దిరోజులలోఁ జక్కఁగ మాఁగి మంచిపరిమళమును - మాధుర్యమునుగల ఫలమై యనుభవించుటకు బహుయోగ్యముగ నుండునదిగదా, అట్లే ముముక్షువగువాఁడు బ్రహ్మచర్యాశ్రమమునందున్నపుడు పింజెవంటివాఁడును, గృహస్థాశ్రమంబునందుండునపుడు కాయవంటివాఁడును. వానప్రస్థాశ్రమంబునందుండునపుడు దోరగిలినకాయవంటివాఁడును నై యుంచున్నాఁడు. కనుక నాపింజెకును కాయకును దోరకాయకును : నెట్లైతే యెండ-గాలి-మిడుత-చిలుక మొదలగువానిచే బాధలు కలుగకుండఁ గాపాడఁబడునో యట్లే ముముక్షువగువాఁడీమూడాశ్రమంబులయందుండు నంతవఱకుఁ దనమనస్సు నింద్రియవిషయాదుల చేతను గామక్రోధాదులచేతను జలింపబడనీక కాపాడుకొనుచు నయ్యాశ్రమాచారధర్మములను యథావిధిగ నిర్వర్తింపుచువచ్చినయెడల నట్టివానికి జ్ఞానవైరాగ్యములు క్రమక్రమముగ హెచ్చుచువచ్చి సంపూర్ణత్వమునొందును అట్టిస్థితి కెప్పుడువచ్చుచున్నాఁడో యప్పుడు కాయదోరగిలినపిమ్మటఁ దనంతటనెట్లు చెట్టునుండివిడిపోవ గమకించునో యట్లే సర్వసంగపరిత్యాగమునందు దృఢచిత్తముగలవాఁడగును. కాన నట్టివాఁడు సన్న్యసించినయెడల వాని మనస్సటుపిమ్మట దేనిచేతను జలింపబడక యట్టియత్యాశ్రమమందు స్థిరముగనిల్చి పరిపక్వదశనుబొంది కొంత కాలంబునకు జీవన్ముక్తుండునుఁ దదనంతరము విదేహముక్తుండును గాఁగలడు.

అట్లు మనః పరిపక్వదశను బొందకమునుపే మోక్షాపేక్షచే నాతురతపడిగాని, లేక, ఏదేనియొక గృహచ్ఛిద్రమువలనఁ దత్కాలమునకు విరక్తి జెందినమనస్సు చేతఁగానీ సన్న్యసించినయెడల నట్టివానిమనస్సాసన్న్యసాశ్రమమునందుస్థిరముగ నుండక కామక్రోధాదులచేతను విషయాదులచేతను జలింపబడుచుండును కాన నట్టివాఁడు పలకవారక పచ్చిగానుండునపుడుకోసి మాఁగవేసినకాయ యెట్లైతే మాధుర్యఫలమగుటకు బదులుగఁ గుళ్ళి యనుభవార్హముగాక చెడిపోవునో యట్లే భ్రష్టుఁడైయిహపరములకు రెంటికిని జెడినవాఁడగును.

అయితే యేదేనియొక గృహచ్ఛిద్రమువలనఁ దత్కాలమందు వైరాగ్యముఁగలిగి సన్న్యసించినవాని మనస్సు కడవఱకు నట్టివైరాగ్యమున స్థిరముగానిలువక

పోయినను పోవచ్చునుగాని నిజమైన మోక్షాపేక్షచే వైరాగ్యమునవలంబించియాతురపడి సన్న్యసించినవాని మనస్సుగూడనట్లేస్థిరముగా నిలువక పోవచ్చునా యనియెడు శంకగలుగఁదగియుంచున్నది. కాననందుకు సమాధానమేమనఁగా, వైరాగ్యము నిష్కామవైరాగ్యమనియు, నిగ్రహీతవైరాగ్యమనియు, రెండువిధములుగలదిగా నుంచున్నది. అందు నిష్కామవైరాగ్య మెట్టిదనఁగా కావలెననెడుకోరికతో నవలంబింపక నప్రయత్నముగఁ దనంతటసిద్ధించు నట్టివైరాగ్యము. అదెట్లనఁగా నొకఁడొక పదార్థము దనకెంతరుచికరమైననుసరె దానినేప్రతిదినమును భుజించుచువచ్చినయెడల దానియందలిరుచి నానాటఁ గ్రమక్రమముగఁ దగ్గుచువచ్చి తుదకు దానియందసహ్య మెట్లుకలుగునో యట్లే నిష్కామకర్మయోగము నవలంబించి విషయముల ననుభవింపుచుండఁగ రాగఁ నట్టివాని కావిషయములయందలి వాంఛ క్రమక్రమముగ దగ్గుచువచ్చి తుదకు వానియందు విరక్తిగలుగును. అట్టివిరక్తి యెవనికిఁ గలుగుచున్నదో వానికి మరల నావిషయములయందు మనస్సు తగులనేరదు.

ఇఁకను నిగ్రహీతవైరాగ్య మెట్టిదనఁగా నొకఁడొకరుచికరమగు పదార్థమును దినవలయుననియెడు నాశగలిగియుండినను దానిం దిన్నయెడల నజీర్ణాది దేహబాధలు గలుగుననియెడు భయముచే దానిం దినుటమానివేసినట్లు, విషయానుభవము మోక్షప్రతిబంధకమనెడు భయముచే నట్టివిషయముల యనుభవమును మానివేయుట అయితే "ఇన్ద్రియాణిబలిష్ఠాని ననియుక్తానిమానద॥ అపక్వస్యప్రకుర్వన్తి వికారాం స్థానసేకశః మనస్తుప్రబలం కామమజేయ ముకృతాత్మభిః," అనునట్లు, అజీర్ణాదిబాధలవలని భయముచేఁ దినమానిన వానిమనస్సెట్లైతే, అరుచికరమగుపదార్థమును దినఁగోరుచునే యుండునో యట్లే యపరిపక్వ వైరాగ్యము నవలంబించినవాని మనస్సు బలిష్ఠములైన యింద్రియములచే విషయములమీఁదికి లాగఁబడుచునేయుండును. కాన నట్టివాని మనస్సు "భోజనేచ్ఛాం సుఖేచ్ఛాంచ శయ్యేచ్ఛామాత్మజస్యచ। యతిస్త్యక్త్వా కథంకుర్యాద్విః కారేనముపస్థితే" అనునట్లు, మంచిభోజనము మృదుశయ్య రతిసుఖము మొదలగువానియందు వ్యాపించుచు ననేకవికారముల నొందుచుండఁగా యత్యాశ్రమధర్మమగు శుద్ధవైరాగ్యమున నిలువఁజాలదు. కాఁబట్టి, "విరక్తస్యాధికారోస్తి సన్న్యాసేనాన్యథాక్వచిత్" అనునట్లు కేవలవైరాగ్యసంపన్నునకగాని తదితరులకు సన్న్యాసాశ్రమము తగదు.

ఒకవేళ నెవఁడైన నిట్టిసంపూర్ణవైరాగ్యము తనంతటఁ బ్రాప్తింపకమునుపే యాతురపడి సన్న్యసించినయెడల నట్టివాఁడు "విహంగస్తరసాయాతి విష్ణుశంకాముదస్యవై" అనునట్లు, ఆకాశమునందు వేగముగా నెగిరెడుపక్షి యేప్రకారమైతే రెక్కలబలము తగ్గినపుడు పడుదుననెడు భయమునొందుచుండునో యట్లేయింద్రియ

ఇదియెట్లున్నదనఁగా అనుభవార్హమైన యొకఫలము మొదటఁ బిందెయై యాపిందె యెండవడకుఁగాని గాలిదెబ్బకుగాని వడలి రాలిపోకుండునట్లు కాపాడఁబడినయెడలఁ గాయయగుచున్నదిగదా, ఆ కాయకు మిడుతపోటు, చిలుకపోటు, ఉడుతపోటు మొదలగుబాధలు కలుగకుండునటులఁ గాపాడఁబడినయెడఁ జక్కఁగ ముదిరి పలకవారి, అనఁగా, పండుటకుఁ బరిపక్వమై తనంటనూడి చెట్టునుండి క్రిందఁబడుటకు సిద్ధమగుచున్నదిగదా. అటిసమయమందా దోరగిలిన కాయను క్రిదఁబడకుండఁగోసి మాఁగ వేసినయెడల నది కొద్దిరోజులలోఁ జక్కఁగ మాఁగి మంచిపరిమళమును – మాధుర్యమునుగల ఫలమై యనుభవించుటకు బహుయోగ్యముగ నుంచున్నదిగదా, అట్లే ముముక్షువగువాఁడు బ్రహ్మచర్యాశ్రమంబునందున్నపుడు పిందెవంటివాఁడును, గృహస్థాశ్రమంబునందుండునపుడు కాయవంటివాఁడును. వానప్రస్థాశ్రమంబునందుండునపుడు దోరగిలిన కాయవంటివాఁడును నై యుంచున్నాఁడు. కనుక నాపిందెకును కాయకును దోరకాయకును : నెట్లైతే యెండ–గాలి–మిడుత–చిలుక మొదలగువానిచే బాధలు కలుగకుండఁ గాపాడఁబడునో యట్లే ముముక్షువగువాఁడీ మూఁడాశ్రమంబులయందుండు నంతవఱకుఁ దనమనస్సు నింద్రియవిషయాదులచేతను గామక్రోధాదులచేతను జలింపబడనీక కాపాడుకొనుచు నయ్యయ్యాశ్రమాచారధర్మములను యథావిధిగ నిర్వర్తింపుచువచ్చినయెడల నట్టివానికి జ్ఞానవైరాగ్యములు క్రమక్రమముగ హెచ్చుచువచ్చి సంపూర్ణత్వమునొందును అట్టిస్థితి కెప్పుడువచ్చుచున్నాఁడో యప్పుడు కాయదోరగిలినపిమ్మటఁ దనంతట నెట్లు చెట్టునుండి విడిపోవ గమకించునో యట్లే సర్వసంగపరిత్యాగమునందు దృఢచిత్తముగలవాఁడగును. కాన నట్టివాఁడు సన్న్యసించినయెడల వాని మనస్సటుపిమ్మట దేనిచేతను జలింపబడక యట్టియత్యాశ్రమమందు స్థిరముగ నిల్చి పరిపక్వదశనుబొంది కొంతకాలంబునకు జీవన్ముక్తుండును తదనంతరము విదేహముక్తుండును గాఁగలడు.

అట్లు మనః పరిపక్వదశను బొందకమునుపే మోక్షాపేక్షచే నాతురత పడిగాని, లేక, ఏదేనియొక గృహచ్ఛిద్రమువలనఁ దత్కాలమునకు విరక్తి జెందినమనస్సుచేతఁగానీ సన్న్యసించినయెడల నట్టివానిమనస్సా సన్న్యాసాశ్రమమునందు స్థిరంబుగ నుండక కామక్రోధాదులచేతను విషయాదులచేతను జలింపబడుచుండును కాన నట్టివాఁడు పలకవారక పచ్చిగానుండునపుడుకోసి మాఁగ వేసిన కాయ యెట్లైతే మాధుర్యఫలమగుటకు బదులుగఁ గుళ్ళి యనుభవార్హముగాక చెడిపోవునో యట్లే భ్రష్టుఁడైయిహపరములకు రెంటికిని జెడినవాఁడగును.

అయితే యేదేనియొక గృహచ్ఛిద్రమువలనఁ దత్కాలమందు వైరాగ్యము గలిగి సన్న్యసించినవాని మనస్సు కడవఱకు నట్టివైరాగ్యమున స్థిరముగానిలువక

పోయినను పోవచ్చునుగాని నిజమైన మోక్షాపేక్షచే వైరాగ్యమునవలంబించియాతురపడి సన్న్యసించినవాని మనస్సుగూడనట్లస్థిరముగా నిలువక పోవచ్చునా యనియెడు శంకగలుగఁదగియుంచున్నది. కాననందుకు సమాధానమేమనఁగా, వైరాగ్యము నిష్కామవైరాగ్యమనియు, నిగ్రహీతవైరాగ్యమనియు, రెండువిధములుగలదిగానుంచున్నది. అందు నిష్కామవైరాగ్య మెట్టిదనఁగా కావలెననెడుకోరికతో నవలంబింపక నప్రయత్నముగఁదనంతటసిద్ధించు నట్టివైరాగ్యము. అదెట్లనఁగా నొకఁడొక పదార్థము దనకెంతరుచికరమైననుసరె దానినేప్రతిదినమును భుజించుచువచ్చినయెడల దానియందలిరుచి నానాటఁ గ్రమక్రమముగఁ దగ్గుచువచ్చి తుదకు దానియం దసహ్య మెట్లుకలుగునో యట్లే నిష్కామకర్మయోగము నవలంబించి విషయముల ననుభవింపుచుండఁగ రాఁగ నట్టివాని కావిషయములయందలి వాంఛ గ్రమక్రమముగ దగ్గుచువచ్చి తుదకు వానియందు విరక్తికలుగును. అట్టివిరక్తి యెవనికిఁ గలుగుచున్నదో వానికి మరల నావిషయములయందు మనస్సు తగులనేరదు.

ఇఁకను నిగ్రహీతవైరాగ్య మెట్టిదనఁగా నొకఁడొకరుచికరమగు పదార్థమును దినవలయుననియెడు నాశగలిగియుండినను దానిం దిన్నయెడల నజీర్ణాది దేహబాధలు గలుగుననియెడు భయముచే దానిం దినుటమానివేసినట్లు, విషయానుభవము మోక్షప్రతిబంధకమనెడు భయముచే నట్టివిషయముల యనుభవమును మానివేయుట అయితే "ఇన్ద్రియాణిబలిష్ఠాని ననియుక్తానిమానద॥ అపక్వస్యప్రకుర్వన్తి వికారాం స్తానసేకశః మనస్తుప్రబలం కామమజేయ మకృతాత్మభిః," అనునట్లు, అజీర్ణాదిబాధలవలని భయముచేఁ దినమానిన వానిమనస్సెట్లైతే, అరుచికరమగుపదార్థమును దినఁగోరుచునే యుండునో యట్లే యపరిపక్వ వైరాగ్యము నవలంబించినవాని మనస్సు బలిష్ఠములైన యింద్రియములచే విషయములమీఁదికి లాగఁబడుచునేయుండును. కాన నట్టివాని మనస్సు "భోజనేచ్ఛాం సుఖేచ్ఛాంచ శయ్యేచ్ఛామాత్మజస్యచ। యతిర్యాత్వా కథంకుర్వాద్వ్వ కారేనముపస్థితే" అనునట్లు, మంచిభోజనము మృదుశయ్య రతిసుఖము మొదలగువానియందు వ్యాపించుచు ననేకవికారముల నొందుచుండఁగా యత్యాశ్రమధర్మమగు శుద్ధవైరాగ్యమున నిలువఁజాలదు. కాఁబట్టి, "విరక్తస్యాధికారోస్తి పన్యాసేనాన్యథాక్వచిత్" అనునట్లు కేవలవైరాగ్యసంపన్నునకగాని తదితరులకు సన్న్యసాశ్రమము తగదు.

ఒకవేళ నెవఁడైన నిట్టిసంపూర్ణవైరాగ్యము తనంతటఁ బ్రాప్తింపకమునుపే యాతురపడి సన్న్యసించినయెడల నట్టివాఁడు "విహంగ స్తరసాయాతి విఘ్నశంకాముదస్యవై" అనునట్లు, ఆకాశమునందు వేగముగా నెగిరెడుపక్షి యేప్రకారమైతే రెక్కలబలము తగ్గినపుడు పడుదుననెడు భయమునొందుచుండునో యట్లేయింద్రియ

విషయములనుండి తన మనస్సును మరలించుటకు శక్తి చాలకపోయినపుడు భ్రష్టత్వము నొందుదునేమో యనెడుభయమును బొందుచునే యుండును. అదెట్లనఁగా, "ఊర్ధ్వం సుప్తః పతత్యేవనశయానః పతత్యధః" అనునట్లు, ఏదైన నొకయున్నతప్రదేశమున, బరుండి నిద్రవోయెడువాఁడే యేదైనవైపు తప్పినయెడలఁ గ్రిందఁబడునుగాని క్రిందఁబరుండి నిద్రించువాఁడు పడఁజాలఁడుగదా, అట్లున్నతప్రదేశమునుండి పడినవాఁడు శిరస్సు పగిలియో లేక యేదైన యవయవము విఱిగియో మరల బ్రదుకుటచిగుల దుర్లభముగదా. "......పరివ్రద్ధు పరిభ్రష్ట మలభతేపునః" అనునట్లు సన్న్యాసాశ్రమమునుండి మనస్సు చలించి భ్రష్టుడైనవాఁ డిహపరములకు రెంటికిని చెడినవాఁడగును. కనుక "అతఃక్రమేణజేతవ్యమాశ్రమానుక్రమేణచ" అనునట్లు, బ్రహ్మచర్యగృహస్థవానప్రస్థాశ్రమములను వరుసక్రమముగ నవలంబింపుచు నయ్యయాశ్రమాచారధర్మములను యథావిధిగ నిర్వర్తింపుచువచ్చి యావల యత్యాశ్రమము నవలంబించుట యుత్తమమైన పద్ధతిగా నుంచున్నది.

అయితే. గృహస్థాశ్రమమునం దుండువానికి ననేకవిధములగు విషయానుభవములును, తద్వారా యనేకవిధములగు సుఖదుఃఖములును సంప్రాప్తములగుచుండును గదా, అట్లుండ వానిమనస్సెట్లు యోగమున నిల్వఁగలదనియు, వానికి సంపూర్ణ జ్ఞానవైరాగ్యము లెట్లు గలుగఁగలవనియు శంకించునెడల నందుకు సమాధానమేమనఁగా, "శ్లో॥ గృహస్థాశ్రమసంస్థోపి శాన్తస్సుమతిరాత్మవాన్ । నచహృష్యేన్నచతప్యేల్లాభా లాభసమోభవేత్ ॥ విహితంకర్మకుర్వాణఃత్యజన్ చిన్తాన్వితం చయత్ । ఆత్మలాభే నసంతుష్టోముచ్యతే నాత్రసంశయః ॥ మనస్తుసుఖదుఃఖానాం మహతాం కారణం ద్విజ । జాతేతునిర్మలేహ్యస్మిన్ సర్వంభవతినిర్మలమ్॥" అనునట్లు, బుద్ధిమంతుడును. శాంతచిత్తుడును, ఆత్మజ్ఞానియునగువాఁడు గృహస్థాశ్రమమందుండినను నిష్కాముఁడై లాభాభాలాభములయందు సమబుద్ధిగలిగి, సుఖము గలిగినపుడు సంతసించుటయు, కష్టముగలిగినపుడు దుఃఖించుటయు లేక యాత్మానుభవము దక్క నితరచింతలేనియు లేనివాఁడై తనవర్ణాశ్రమాచారవిహితములగు నిత్యనైమిత్తికాది కర్మములను యథావిధిగ నాచరింపుచుండును. అట్లెవఁడైతే యాచరించుచు వచ్చునో వానిమనస్సు నిర్మలము గానుండును. సమస్తసుఖదుఃఖములకును బంధమోక్షములకును మనస్సే కారణముగ నుంచున్నది గనుక నట్టిమనస్సెప్పుడైతే నిర్మలమైనదగుచున్నదో, అప్పుడు సమస్తము నిర్మలమే యగుచున్నదిగాన నట్టివానికి నేలాటి పుణ్యాపాపములు నంటనేరవు. కాఁబట్టి యట్టివాఁడు సంసారబంధమునుండి ముక్తుడగుటకు నేలాటిసంశయము నుండనేరదు. కావున నిదియే నిష్కామకర్మయోగ మనఁబడుచున్నది.

ఇట్టి నిష్కామకర్మయోగియు నాచరించెడువాఁడు. "యథాఽపి పిపీలికా మూలా చ్ఛాఖాయామధిరోహతి" అనునట్లు, నేలఁ బ్రాకెడు మిక్కిలి యల్పజంతువగు చీమ యెట్లైతే యొక గొప్ప వృక్షముయొక్క వేరునుండి మెల్లగఁ బైకిఁ బ్రాకుచు నావృక్షముయొక్క శాఖాగ్రమునకుఁ బోవునో, యట్లే యీనిష్కామకర్మయోగియుఁ గ్రమక్రమముగ జ్ఞానవైరాగ్యములయందు హెచ్చుచువచ్చును. బలిష్ఠములగు నింద్రియములచే నట్టివాని మనస్సొకానొకప్పుడు చలింపఁబడినను నందువలన భ్రష్టత్వభయము లేనివాఁడై "శ్రాన్తాభవతి విశ్రమ్య సుఖం యాతి పిపీలికా" అనునట్లు, ఎట్లైతే, ఆగొప్పవృక్షముపై కెక్కిపోయెడుచీమ యొక్కెక్కడఁ దనకు మార్గాయాసము గలుగుచున్నదో, అక్కడక్కడఁ గొంతసేపు విశ్రమించుచు నామార్గాయాసము దీర్చినపిమ్మట మరలఁ బైకిఁబోవుచు "శనైశ్శనైః ఫలం యాతి సుఖేన సదగామినీ" అనునట్లు, మెల్లమెల్లగా నాకొమ్మయొక్క చిట్టచివరకుఁబోయి యచట నుండు ఫలము నెట్లైతే యనాయాసముగఁ బొందఁగలుగునో, అట్లే యీనిష్కామకర్మయోగియుఁ దనమనస్సెప్పుడెప్పుడే యేవిషయములయందుఁ బ్రవర్తింపుచుండునో, అప్పుడప్పుడాయావిషయములను ధర్మవిరుద్ధములు గాకుండునట్లనుభవింపుచు, తద్ద్వారా మనస్సును శాంతినొందింపుచు మరల నామనస్సు నాత్మానుభవమునం దలవఱచుకొనుచువచ్చును. అట్లుచేయుచు రాఁగరాఁగ వానిమనస్సు విషయవాంఛలఁ గ్రమక్రమముగ నొక్కొకటిగ విడిచినదై నిశ్చలత్వమునొందును. అట్లెప్పుడగుచున్నదో, అప్పుడు వాఁడు మోక్షార్హుఁడగుటకు సందియము లేదు.

ఈపైని వివరింపబడిన విషయములవలన మోక్షమును బొందుటకుఁ బ్రవృత్తి నివృత్తిమార్గములు రెండు గలవనియు, అందు నివృత్తిమార్గము ముక్తిదమనియు, అట్టి నివృత్తిమార్గమునకుఁ బ్రవృత్తిమార్గము సాధనమనియు, కాన ముముక్షువగువాఁడు ముందు ప్రవృత్తిమార్గము నవలంబించి దానిని జక్కఁగ నిర్వర్తించి యందువలనఁ దనంతట సిద్ధించునట్టి నివృత్తిమార్గమును బొందిననే ముక్తుఁడు గాఁగలఁడుగాని యట్లు చేయక మొదటనే నివృత్తిమార్గము నవలంబించినయెడల నిర్విఘ్నముగ ముక్తుఁడు కాఁజాలఁడని యేర్పడుచున్నదిగదా; అయితే యీలోకమున ననేకు లిట్టి క్రమమైన పద్ధతి నవలంబింపక యాతురపడి నివృత్తిమార్గము నవలంబించి యందు మనస్సు నిలుపఁజాలక, యుభయభ్రష్టులగుచుండుటవలన నట్లు జనులు చెడకుండఁగా గాపాడుటకై వారలకొఱకు, నారాయణాంశసంభూతుండగు శ్రీకృష్ణభగవానులు నరాంశసంభూతుండగు నర్జునునకు నుపదేశించెడు వ్యాజమున, నీప్రవృత్తి నివృత్తి మార్గములరెంటిని జక్కఁగ విపులపఱపఁదలఁచి యీ భగవద్గీతయందలి యంశములన్ను గృపఁజేసెనని యూహింపఁదగి యున్నది.

ఈగీతామాహాత్మ్య మెట్టిదైనదియు, శ్రీమహావిష్ణువు భూదేవికి నుపదేశించినట్లు శ్రీవరాహపురాణమునఁ జెప్పఁబడియుండు నీక్రింది శ్లోకములవలనఁ దెలియఁగలము.

"ప్రారబ్ధం భుజ్యమానోఽపిగీతాభ్యాసరత స్సదా
స ముక్తస్స సుఖీలోకే కర్మణా నోపలిప్యతే
మహాపాపాదిపాపాని గీతాధ్యానం కరోతి చేత్,
క్వచి త్స్పర్శం న కుర్వన్తి నలినీదళ మంబువత్.
గీతాయాః పుస్తకం యత్ర యత్రపాఠః ప్రవర్తతే,
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్ర వై.
సర్వే దేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చయే,
గోపాలా గోపికా వాపి నారదోద్ధవ పార్షదైః,
సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే.
యత్ర గీతావిచార శ్చ పఠనం పాఠనం శ్రుతమ్,
తత్రాహం నిశ్చితం పృథ్వినివసామి సదైవ హి
గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతామే చోత్తమం గృహమ్,
గీతాజ్ఞాన ముపాశ్రిత్య త్రీన్ లోకాన్ పాలయా మ్యహమ్,
గీతా మేపరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః
అర్ధమాత్రక్షరా నిత్యా స్వనిర్వాచ్యపదాత్మికా.
చిదానందేనకృష్ణేన ప్రోక్తాస్వముఖతోఽర్జునమ్,
వేదత్రయీ పరానందా తత్త్వార్థజ్ఞాన సంయుతా.
యోఽష్టాదశజపే న్నిత్యం నరో నిశ్చలమానసః,
జ్ఞానసిద్ధిం స లభతే తతో యాతి పరం పదమ్
పాఠేఽసమర్థ స్సంపూర్ణే తదర్ధం పాఠ మాచరేత్,
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః
త్రిభాగం పఠమాన స్తు గంగాస్నానఫలం లభేత్,
షడంశం జపమానస్తు సోమయాగఫలం లభేత్.
ఏకాధ్యాయంతు యో నిత్యం పఠతే భక్తిసంయుతః,
రుద్రలోక మవాప్నోతి గణో భూత్వా వసేచ్చిరమ్.
అధ్యాయం శ్లోకపాదంవా నిత్యం యః పఠతే నరః,
స యాతి నరతాం యావన్మనుకాలం వసుంధరే!
గీతాయా శ్లోకదశకం సప్తపఞ్చ చతుష్టయమ్,

ద్వౌత్రీనేకం తదర్థం వా శ్లోకానాం యఃపఠేన్నరః.
చన్ద్రలోక మవాప్నోతి వర్షాణామయుతం ధ్రువమ్,
గీతా పాఠసమాయుక్తో మృతో మానుషతాంవ్రజేత్.
గీతాభ్యాసం పునఃకృత్వా లభతేముక్తిముత్తమామ్,
గీతే త్యుచ్చారసంయుక్తో మ్రియమాణో గతిం లభేత్.
గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతోఽపివా,
వైకుణ్ఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే.
గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః
జీవన్ముక్త స్స విజ్ఞేయో దేహాన్తే పరమం పదమ్.
గీతా మాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః,
నిర్ధూతకల్మషా లోకే గీతాయాతాః పరం పదమ్.
గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యఃపఠేత్,
వృథా పాఠో భవేత్తస్య శ్రమ ఏవ ఉదాహృతః
ఏతన్మాహాత్మ్యసంయుక్తం గీతాభ్యాసం కరోతి యః,
స తత్ఫల మవాప్నోతి దుర్లభాం గతిమాప్నుయాత్."

---

క. కావున నెవ్వరైనను భువి,
శ్రీవిభు మదినిల్పి శాంతచిత్తముతోడం
గావింపఁ గర్మయోగము.
భావజజనకుం డొసంగు బరమపదంబున్.

---

## త్రిమూర్త్యాత్మకుఁడగు పరబ్రహ్మప్రార్థన

శా. శ్రీవాణీకమలాశివాఖ్యల భువిం జెన్నొందు మాయావధూ
టీవైవాహికతం దనర్చి జగముల్ సృష్టింపఁ బెంపంగ నా
శావాప్తింగలిగింపఁబూని యజుఁడై యావిష్ణుఁడై యీశ్వరుం
డై వర్తించు పరాపరాత్మ్యకుని నే నర్థింతు నశ్రాంతమున్.

## శ్రీభగవద్గీతోపదేష్టయగు శ్రీకృష్ణమూర్తి ప్రార్థన

"మ. నరుమాటల్విని నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలోఁ
బరులీక్షింప రథంబునిల్పి పరభూపాలావళింజూపుచుం
బరభూపాయువులెల్లఁజూపులను శుంభత్కేళివంచించు నా
పరమేశుండు వెలుంగుచుండెడు సుహృత్పద్మాసనాసీనుఁడై."

"క. తనవారిఁ జంపఁజాలక
వెనుకకుఁ బోనిచ్చగించు విజయుని శంకన్
ఘనయోగవిద్యఁబాపిన
మునివంద్యుని పాదభక్తి మొనయు న్నాకున్."

"మ. హయరింఖాముఖధూళిధూసరపరిన్యస్తాలకోపేతమై
రయజాతశ్రమతోయబిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో
జయముం బార్థునకిచ్చువేడ్క నని నాశస్త్రాళిహతింజాల నొ
చ్చియుఁ బోరించు మహానుభావు మదిలో జింతింతు నశ్రాంతమున్."

"మ. బలభీమార్జునముఖ్యచాపధరరూపవ్యాజతం గ్రూరులన్
ఖలులన్ దుష్టధరాతలేశ్వరులసంగ్రామైకపారీణదో
ర్బలకేళిం దునుమాడి సర్వధరణీభారంబుమాయించి సా
ధులరక్షించినయట్టి కృష్ణుని ననంతుం గొల్తు నెల్లప్పుడున్."

## శ్రీభగద్గీతాప్రణేతయగు వ్యాసమహర్షిప్రార్థన

"ఉ. ప్రాంశుపయోదనీలతనుభాసితు నుజ్జ్వలదండధారుఁ బిం
గాంశుజటాచ్ఛటాభరణు నాగమపుంజపదార్థతత్త్వ ని
స్సంశయకారుఁ గృష్ణమృగచర్మకృతాంబరకృత్యు భారతీ
వంశవివర్ధనుం ద్రిదశవందితు సాత్యవతేయు గొల్చెదన్.

## శ్రీగణాధిపతి ప్రార్థన

"ఉ. ఆదరమొప్ప మ్రొక్కిడుదు నద్రిసుతాహృదయానురాగసం
పాదికిదోషభేదికిఁ బ్రపన్నవినోదికి విఘ్నవల్లికా
చ్ఛేదికి మంజువాదికి నశేషజగజ్జననందవేదికిన్
మోదకఖాదికిన్ సమదమూషకసాదికి సుప్రసాదికిన్."

## శ్రీపార్వతీ ప్రార్థన

"ఉ॥ క్షోణితలంబు నెన్నుదురుసోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయసుందరవేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవచిత్తవశీకరణైకవాణికిన్
వాణికి నక్షదామశుకవారిజపుస్తకరమ్యపాణికిన్."

# విషయసూచిక

ఈశ్వరుఁడులేడనియును, ఈప్రపంచమంతయు స్త్రీపురుష సంయోగ మాత్రముచేతనే పుట్టుచున్నదనియును జెప్పుదు రనుటకు (16. 8)

అట్లు తలఁచువారై, అల్పబుద్ధులును, నష్టాత్ములును, ఉగ్రకర్ములును, జగచ్ఛత్రువులును గానుందు రనుటకు (16. 9)

ఆశాపరవశులును, దంభమానమదయుక్తులును, అశుచివ్రతులును, అవివేకులునై ప్రవర్తింతు రనుటకు (16. 10)

ఎల్లప్పుడు ననేకవిధములగు మనోరథములు గలవారును, ఆశాపాశబద్ధులును, కామక్రోధపరాయణులునునై విషయానుభవమే పరమపురుషార్థముగ నెంచి యందుకుఁదగిన ద్రవ్యముల నక్రమముగానైన నార్జింపఁజూతు రనుటకు (16. 11, 12)

ఇది నేను బొందినాను, ఇఁక నీమనోరథమును బొందఁ బోవుచున్నాను, ఇది నాయది, యను మొదలగు నహంకారమమకారములతోఁ గూడినవారై నరకమునఁ బడుదు రనుటకు (16. 13, 14, 15, 16)

కామక్రోధాద్యనేక దుర్గుణములుఁగలవారలై యెప్పుడును రాక్షసగణమునందే జన్మింపుచుందు రనుటకు (16. 17, 18, 19)

ప్రతిజన్మమునందును నసురయోనియందే పుట్టుచు నధమాధమగతిని బొందుదు రనుటకు (16. 20)

అహంకారము—లేనివానికిఁ జిత్తశాంతికలుగు ననుటకు (2. 71)

గలవాఁడు, ప్రకృతిగుణములచేఁ జేయఁబడు కర్మను దనయం దారోపించుకొనుచున్నాఁ డనుటకు (3. 27)

ఆకాశము—నందు వాయువెట్లు వ్యాపించియున్నదో, అట్లే పరమాత్మయందు సమస్తభూతములు వ్యాపించియున్న వనుటకు (9. 6)

ఎట్లైతే సర్వగతమైనను దేనియందంటక యుండునో, అట్లే, ఆత్మయును సమస్తదేహముల యందుండియు నాదేహసంబంధములగు గుణదోషముల నంటదనుటకు (13. 33)

ఆత్మ—భూతభవిష్యద్వర్తమాన కాలములయం దెప్పుడునుండునదియే యనుటకు (2. 12)

ఒకదేహమునుండి మఱియొకదేహమునఁ బ్రవేశించుటే మరణమనుటకు (2. 13)

సత్పదార్థముగనుక దానికి, అభావము (అస్థిరత్వము) లే దనుటకు (2. 16)

దీని నెవఁడును నాశముగలుగఁ జేయఁజాలఁ డనుటకు (2. 17)

మఱియొకయాత్మను జంపుటగాని, మఱియొక యాత్మచేఁ జంపఁబడుటగాని లే దనుటకు (2. 19)

జననమరణాదులులేనిదియు, శరీరముచచ్చినను దాను జావనిదియు ననుటకు (2. 20)

మఱియొకయాత్మను జంపుటగాని, చంపించుటగాని లే దనుటకు (2. 21)

ఆత్మ—ఒక దేహమును విడిచి మఱియొక దేహమునఁ బ్రవేశించుట, పాతవస్త్రమును విడిచి నూతనవస్త్రమును ధరించునట్టిది యనుటకు (2. 22)

శస్త్రాదులచే నశింపఁజేయఁబడఁజాల దనుటకు (2. 23, 24)

వినుటకును, కనుటకును, ఆశ్చర్యమైన వస్తు వనుటకు (2. 29)

దేహమునశించినను దాను నశింప దనుటకు (2. 30)

బుద్ధికంటె బలమైనదనుటకు (3. 42.)

ప్రపంచమునందలి సమస్త చరాచరాత్మకములయందుఁ బ్రవర్తింపుచుండియు, నవి నశించినను, దాను నశింపకుండునని తెలిసికొనినవాఁడే జ్ఞాని యనుటకు (13. 28)

ఇట్టిదని యెఱిఁగెడువాఁడు జీవహింసఁజేయఁ బూనుకొనఁడు. కనుక నట్టి వాఁడు మోక్షమును బొందు ననుటకు (13. 29)

సమస్తశరీరములయందుండు వాఁడైనను, కర్మములఁజేయుటగాని, ఆకర్మములచే బద్ధుఁడగుట గాని లే దనుటకు (13. 32)

ఆకాశమెట్లైతే సర్వగతమయ్యును దేనియందంటకయుండునో, అట్లే సమస్త దేహములయందుండియు నాదేహసంబంధమగు గుణదోషముల నంట దనుటకు (13. 33)

సూర్యుఁ డొక్కఁడయ్యును నేప్రకారముగా నీలోకమునంతటిని బ్రకాశింపఁజేయు చున్నాఁడో ఆప్రకారమే యీసమస్తచరాచర ప్రపంచమును బ్రకాశింపఁ జేయుచున్నాఁ డనుటకు (13. 34)

దేహస్థుఁడైయుండు నంతవఱకుఁ బ్రకృతిసంభవములగు సత్త్వరజస్తమోగుణములచే బద్ధుఁడగు ననుటకు (14. 5)

భూమియం దావేశించి సమస్తభూతములను భరింపుచు, ఆ భూతసంరక్షణార్థమై చంద్రునియం దావేశించి సమస్తసస్యములను వృద్ధిఁ బొందింపుచున్నాఁడనుటకు (15. 13)

దేహమునం దావేశించి జఠరాగ్నిరూపమున, అన్నాదులను జీర్ణింపఁజేయు ననుటకు (15. 14)

సమస్తప్రాణులయం దంతర్యామిగా నుండి స్మృతిజ్ఞానాపోహనాదులఁ గలుగఁజేయు ననుటకు (15. 15)

వేదవేదాంతములను జేసినవాఁడును, వాని నెఱిఁగినవాఁడును, వానిచే నెఱుఁగఁ బడఁదగిన వాఁడు ననుటకు (15. 15)

ఆదిత్యులలో—విష్ణువనెడువాఁడు భగవత్స్వరూపుఁ డనుటకు (10. 21)

ఆయుధములలో—వజ్రాయుధము భగవత్స్వరూప మనుటకు (10. 28)

ఆరురుక్షువునకు—కర్మాచరణమావశ్యక మనుటకు (6. 3)

సృష్టికర్త యగు భగవంతుని నంట దనుటకును, అట్లెరిగినవానిని గూడనంట దనుటకును (4. 14)

— ఎట్టిదైనదియు, అకర్మయెట్టిదైనదియుఁ దెలిసికొనుటలో జ్ఞానులు సయితము భ్రమింతు రనుటకు (4. 16)

చేయందగినది యెట్టిదని తెలిసికొనవలయు ననుటకు (4. 17)

యందు, అకర్మనుజూచువాఁడు, అనఁగా, చేయఁదగినకర్మ చేయఁగూడనిదిగా నెప్పుడగుచున్నదో దానిని దెలిసికొనువాఁడు బుద్ధిమంతుఁ డనుటకు (4. 18)

కామవర్జితునిచేఁ గేవలదేహధారణార్థమై చేయఁబడినను, వానినంటనేర దనుటకు (4 21)

సిద్ధ్యసిద్ధులయందు సమభావముతోఁజేయువానినిబంధింపనేర దనుటకు (4. 22

వలననే యజ్ఞములన్నియుఁ బుట్టిన వనుటకు (4. 32)

చిత్తశుద్ధికొఱకుఫలాసక్తిరహితముగా యోగులచేనాచరింపఁబడుననుటకు (5.11)

ఆరురుక్షువున కావశ్యక మనుటకు (6. 3)

ఆరూఢున కావశ్యకము లే దనుటకు (6. 3)

అనఁగా, భూతోత్పత్తికారణమగు విసర్గమే రనుటకు (7. 3)

సాత్త్వికమనియు,రాజసమనియు,తామసమనియు త్రివిధము లనుటకు (18.19)

దోషయుక్తమైనదైనను, తనకులాచారము ననుసరించి సహజమైనదిగా నున్న యెడల. దానిని త్యజింపఁగూడ దనుటకు (18. 48)

ను అనాసక్తచిత్తముతోఁ జేయవలయు ననుటకు (2. 48)

ఆచరింపకయే నైష్కర్మ్యసిద్ధి గలుగ దనుటకు (3. 4)

కొంతమట్టున కాచరించివదలుటవలనను నైష్కర్మ్యసిద్ధిగలుగ దనుటకు(3.4)

ఆచరింపక యెవఁడును క్షణమైననుండఁజాలఁ డనుటకు (3. 5)

ప్రతిపురుషుఁడును, వానివాని స్వభావగుణములచేఁ బ్రేరేపింపఁబడి చేయుచునే యుండు ననుటకు (3. 5)

ఆచరింపక విషయములను మాత్రము స్మరింపుచుండెడువాఁడు మిథ్యాచారుఁ డనుటకు (3. 6)

ఆచరింపుచు, ఇంద్రియముల నిగ్రహించి యనాసక్తచిత్తుఁడుగాక యుండువాఁడు శ్రేష్ఠుఁ డనుటకు (3. 7)

అనాసక్తచిత్తముతోఁజేయుచు బ్రహ్మార్పణము చేయువానికిఁ బాపమంట దనుటకు (5. 10)

లనన్నింటిని భగవంతునకు నర్పణచేసి నిష్కాముఁడైయుండవలె ననుటకు (3.30)

ఎవఁడైతే, కర్తృత్వాభిమానమును, ఆసక్తియు లేక చేయుచున్నాఁడో వాఁడు హత్యచేసినను, ఆదోషము వాని నంటనేర దనుటకు (18. 17)

ఆగు పురుషుఁడు (క్షేత్రజ్ఞుఁడు) ప్రకృతిగుణ సాంగత్యముచే సదసద్యోనుల యందు జన్మించు ననుటకు (13. 22)

పరమాత్మయంశమే యైనను, ప్రకృతిసంబంధములగు నింద్రియములచే విషయములమీఁదికి లాగఁబడుచుండుననుటకు (15. 7)

దేహములయందుఁ బ్రవేశించునపుడును, దేహములనుండి వెడలిపోవునపుడును, ఇంద్రియమనస్సులను దనతోఁ దీసికొని పోవు ననుటకు (15. 8)

శ్రోత్రత్వక్చక్షు ర్జిహ్వాఘ్రాణేంద్రియముల నాశ్రయించి తద్వారా విషయముల ననుభవించు ననుటకు (15. 9)

ఇట్టివాఁడని జ్ఞానదృష్టిగల వారలెఱుంగుదురే గాని మూఢు లెఱుంగఁజాల రనుటకు (15. 10-11)

జూదము—వంచకమైనవస్తువులలో భగవత్స్వరూప మనుటకు (10. 36)

జ్ఞానము—కామముచేఁగప్పఁబడి ప్రకాశింపకుండు ననుటకు (3. 38-39)

సద్గురువు నాశ్రయించి పొందవలె ననుటకు (4. 34)

జ్ఞానము—పొందినపిమ్మట, చరాచరములన్నియు భగవత్స్వరూపములేయని తెలియఁబడు ననుటకు (4. 35)

పాపమనెడు సముద్రమును దాటుటకుఁ దెప్పవంటి దనుటకు (4. 36)

కర్మలనన్నింటిని భస్మముఁజేయు ననుటకు (4. 37)

కంటెఁబవిత్రమైనది మఱియొకటి లే దనుటకు (4. 38)

యోగసిద్ధిని బొందినవానికిఁ గాలక్రమమునఁ దనంతటఁ గలుగు ననుటకు (4. 38)

ఇంద్రియనిగ్రహముగలిగి శ్రద్ధావంతుడైనవానికిఁ గలుగు ననుటకు (4. 39)

కలిగిన వెంటనే చిత్తశాంతి గలుగు ననుటకు (4. 39)

శ్రద్ధలేనివానికిని, సంశయాత్మకునకును, గలుగ దనుటకు (4. 40)

చేత. నజ్ఞానము నశించినవానికిఁ బరమాత్మస్వరూపము గోచరించు ననుటకు (5. 16)

చే నశింపఁజేయఁబడిన పాపములుగలవారు పరబ్రహ్మమునందే మనస్సు నిలిపినవారై మోక్షము నొందుదు రనుటకు (5. 17)

లేనివారు కామాత్మకులై యన్యదేవతల నారాధింతు రనుటకు (7. 20)

అనఁగా, క్షేత్రక్షేత్రజ్ఞుల నెఱుఁగుట యనుటకు (13. 3)

అనఁగా, అమానిత్వాది యిరువది లక్షణములుగలది యనుటకు (13. 8-9-10-11-12)

సాత్త్వికజ్ఞానమనియు, రాజసజ్ఞానమనియు, తామసజ్ఞానమనియు, మూఁడు విధములుగానుండు ననుటకు (18. 19)

జ్ఞానయోగము—సాంఖ్యు లవలంబింపవలయు ననుటకు (3. 3)

జ్ఞానవంతులలో—నుండు జ్ఞానము భగవత్స్వరూప మనుటకు (10. 38)

జ్ఞానసిద్ధి—బొందిన పిదప, పరబ్రహ్మసాయుజ్యమును బొందఁగలమార్గ మెట్టి దనుటకు (18. 54-55-56)

జ్ఞాని—సుకృత దుష్కృతములను రెంటిని నీలోకమునందె విడిచిపెట్టి పోవుచున్నాఁ డనుటకు (12. 50)

అనాసక్తచిత్తుఁడైనను, లోకసంగ్రహముకొఱకు నాసక్తచిత్తుఁడగు పామరునివలెఁ గర్మ నాచరింపవలె ననుటకు (3. 25)

యగువాఁడుగూడఁ దన ప్రకృతి గుణముల కనుగుణ్యములగు చేష్టలఁ జేయుచుండు ననుటకు (3. 33)

యగువానికి రాగద్వేషములు శత్రువు లనుటకు (3. 34-37)

యగుబ్రహ్మవిదుఁడు, ఇష్టమును బొందినపుడు సంతోషించుటయు, అనిష్టమును బొందినపుడు దుఃఖించుటయు లే దనుటకు (15. 20)

బాహ్యవిషయములయం దాసక్తిలేనివాఁడై యక్షయమగు నంతస్సుఖము ననుభవించు ననుటకు (5. 21)

విషయసుఖము లాద్యంతములు గలవియును, దుఃఖాస్పదములును గనుక వానియం దాసక్తచిత్తుఁడు గాఁ డనుటకు (5.32)

జ్ఞాని—కామక్రోధములయొక్క వేగమును సహింపఁగలఁ డనుటకు (5. 23)

భగవంతుని నెట్టివానిగా నెఱిఁగి శాంతినొందు ననుటకు (5. 29)

అంతస్సుఖియు, అంతరారాముండును, అంతఃప్రకాశుండునై యుండు ననుటకు (5. 24)

భగవంతుని భజించు ననుటకు (7 16)

భగవంతుని భజించెడు నాల్గుతరగతులవారిలో శ్రేష్ఠుఁ డనుటకు (7. 17)

భగవంతునికి మిక్కిలి ప్రియుఁ డనుటకు (7. 17)

భగవత్స్వరూపుఁడే యనుటకు (7. 18)

అనేకజన్మసంస్కారములవలననే గాని కానేరఁ డనుటకు (7. 19)

యగువాఁడీలోకమున మిక్కిలి యరుదుగానుండు ననుటకు (7. 19)

జ్ఞానికి—భగవంతుఁడు మిక్కిలి ప్రియుఁ డనుటకు (7. 17)

జ్ఞానులు—సయితము కర్మాకర్మలఁ దెలిసికొనుటలో భ్రమింతు రనుటకు (4. 16)

అందరియందును సమభావముగల వా రనుటకు (5. 18)

జ్ఞానేంద్రియములను—నిగ్రహింపుచుఁ గర్మేంద్రియములచేఁ గర్మనాచరించువాఁడు
శ్రేష్ఠుఁ డనుటకు (3. 7)

జ్ఞేయము—పరబ్రహ్మ మనుటకు (13. 13-14-15-16-17-18)

తత్—అనుశబ్దము ముముక్షువులచే, యజ్ఞ దానతపస్సుల నారంభించునపు డుచ్చరిం
పఁబడు ననుటకు (17. 25)

తత్త్వము.—నెఱిఁగినవాఁడు, ఏయేప్రకృతిగుణము లాయాకర్మలయందుఁ బ్రవర్తింపు
చున్నవని యెఱిఁగినవాఁడై, ఆసక్తచిత్తుఁడుగాకయుండు ననుటకు (3. 28)

తపస్సు—దేవ - బ్రాహ్మణ - గురు - శిష్టజనులఁబూజింపుచు - శౌచము-ఆర్జవము
- బ్రహ్మచర్యాదులు గలిగి యుండునది, కాయికతపస్సనఁబడు ననుటకు
(17. 14)

ఇతరులమనస్సు నొప్పింపక ప్రీతివిశ్వాసములను గలుగఁజేయునట్లు మాటలాడు
టయు, వేదాధ్యయనముచేయుటయు, వాచికతపస్సనఁబడు ననుటకు
(17. 15)

మనస్సునకుహితమైనసద్వృత్తియు, మితభాషిత్వమును, మనోనిగ్రహమును,
చిత్తశాంతియు, గలిగియుండుట మానసిక తపస్సనఁబడు ననుటకు (17.16)

సత్త్వరజస్తమోగుణములచేఁ ద్రివిధము లనుటకు (17. 7)

తమోగుణము—అజ్ఞానమువలనఁబుట్టి, దేహిని బ్రమాదాలస్యనిద్రాదులచే బద్ధుని
జేయుచున్న దనుటకు (14. 8)

ప్రమాదకార్యములయందుఁ బ్రవర్తింపఁజేయు ననుటకు (14. 9)

సత్త్వరజోగుణముల నడఁచుచున్న దనుటకు (14. 10)

ప్రధానముగాఁ గలవాని లక్షణము లెట్లుండు ననుటకు (14. 13)

ప్రధానముగాఁగలవాఁడెట్టి జన్మములనొందు ననుటకు (14. 15)

యొక్క—ఫలము, అజ్ఞాన మనుటకు (14. 16)

వలన నజ్ఞానసంబంధమగు మోహప్రమాదము లుత్పన్నము లగుచున్న
వనుటకు (14. 17)

గలవారు పశ్వాది నీచజన్మముల నెత్తుదురనుటకు (14. 18)

తామస—శ్రద్ధగలవారలు, ప్రేతభూతగణముల నారాధింతు రనుటకు (17. 4)

ఆహారములునిస్సారములైనవిగను, చల్లివిగను, దుర్గంధములుగలవిగను, అమే
ధ్యములైనవిగనునుండు ననుటకు (17. 10)

యజ్ఞము, దానలోప-మంత్రలోప-శ్రద్ధాలోపములుగలిగి యాశాస్త్రీయముగఁ
జేయఁబడునవి యనుటకు (17. 13)

తపస్సు తనకుఁ బ్రయాసకరమును, ఇతరులకు హింసాకరమును, నైయుండు ననుటకు (17. 19)

దానము నికృష్టదేశ కాలములయందును, అపాత్రములయందును, దిరస్కారా వమాన సహితముగను జేయఁబడినదిగా నుండు ననుటకు (17. 22)

త్యాగము, విద్యుక్తములగు కర్మలను, అజ్ఞానముచేతవిడిచిపెట్టుట యనుటకు (18. 7)

తామస—జ్ఞానమనఁగా జీవాత్మపరమాత్మలు, పరిమితిగలవియని యల్పబుద్ధితో దెలుఁగుట యనుటకు (18. 22)

కర్మయనఁగా, కాఁగలశుభాశుభములను, నష్టమును, పరహింసయు, తన శక్తియు నాలోచింపక నజ్ఞానముచేఁ జేయఁబడునది యనుటకు (18. 25)

కర్తయనఁగా అయోగ్యుఁడును, అవివేకియును, స్తబ్ధుఁడును, కుత్సితుఁడును, వంచకుఁడును, మందుఁడును, దుఃఖశీలుఁడును, పరులకపకారముచేయుట యందు దీర్ఘాలోచనపరుఁడునునై కర్మనాచరించువానికిఁ బేరనుటకు (18. 28)

బుద్ధియనఁగా, అధర్మమును ధర్మముగను, అకార్యములను కార్యములుగను, సకలార్థములను వ్యత్యస్తములుగను, నజ్ఞానముచేఁదలఁచెడు బుద్ధికిఁ బేరనుటకు (18. 32)

ధైర్యమనఁగా, దుర్బుద్ధియగువాఁడే ధైర్యముచేత నిద్రాభయశోక మదములను విడువఁడో, అట్టిధైర్యమునకుఁ బేరనుటకు (18. 35)

సుఖమనఁగా, మోహాత్మక బుద్ధిచే నిద్రాలస్య ప్రమాదములవలనఁగలిగెడు దానిని సుఖముగా నెప్పుడుతలఁచఁబడుచున్నదో యట్టిసుఖమునకుఁ బేరనుటకు (18. 39)

దానమనఁగా నికృష్టదేశకాల పాత్రంబులయం దవమానపూర్వకంబుగా నిచ్చుదానమునకుఁ బేరనుటకు (17. 22)

త్యాగము—అనఁగా, సర్వకర్మ ఫలత్యాగమునకుఁ బేరనుటకు (18. 2)

త్రికాలములు—భగవంతుఁ డెఱుఁగు ననుటకు (7. 26)

త్రిగుణాతీతుఁడు—జన్మమృత్యు జరాదుఃఖములవలన విముక్తుఁడై మోక్షమునొందు ననుటకు (14. 20)

చలింపని భక్తియోగముచే మోక్షార్హుఁడగు ననుటకు (14. 25)

నిర్ముక్త లక్షణము లెట్లుండుననుటకు (14. 22-23-24-25)

తేజస్వులలోనుండెడు—తేజస్సు భగవత్స్వరూప మనుటకు (10. 36)

సమస్తభూతములను గల్పాంతమున లయింపఁజేసి మరలఁ గల్పాదియందు సృజింపుచుండు ననుటకు (9. 7)

తనమాయచే సమస్తభూతములను మరల మరల సృజింపుచుండు ననుటకు (9. 8)

పరమాత్మ—సృష్టికర్మచే బద్ధుఁడు కాఁ డనుటకు (9. 9)

జగత్సృష్టికి సాక్షిభూతుఁడుగా నున్నాఁడనుట (9. 10)

క్షేత్రమను దేహమున క్షేత్రజ్ఞుఁడనెడుపేర జీవాత్మస్వరూపమున నుపద్రష్టగను, అనుమోదించువాఁడుగను, భరించువాఁడుగను, అనుభవించువాఁడుగను, నియామకుఁడుగను, నుంచున్నాఁ డనుటకు (13. 23)

ను, కొందఱు ధ్యానయోగముచేతను, కొందఱు జ్ఞానయోగముచేతను, మఱికొందఱు కర్మయోగముచేతను, జూచుచున్నారనుటకు (13. 25)

ధ్యాన-జ్ఞాన-కర్మయోగములచే నెఱుఁగలేని వార లాచార్యోపదేశమువలనను వేదాంతశ్రవణాదులవలనను, నెఱిఁగి తరింతు రనుటకు (13. 26)

సమస్త శరీరములయందుండువాఁడైనను, కర్మలఁజేయుటగాని, ఆకర్మలచే బద్ధుఁడగుటగానిలే దనుటకు (13. 32)

ఆకాశమెట్లయితే సర్వగత మయ్యును దేనియందంటక యుండునో, అట్లే సమస్తదేహములయందుండియు నాదేహసంబంధమగు గుణదోషముల నంట దనుటకు (13. 33)

సూర్యుఁడొక్కఁడయ్యును నేప్రకారముగా నీ లోకమంతటిని బ్రకాశింపఁజేయుచున్నాఁడో, అప్రకారమే యీసమస్త చరాచర ప్రపంచమును బ్రకాశింపఁజేయుచున్నాఁ డనుటకు (13. 34)

యొక్కయంశమే జీవస్వరూపమున దేహములయందుండి, ప్రకృతి సంబంధములగు నింద్రియములచే విషయముల మీఁదికి లాగఁబడుచున్న దనుటకు (15. 7)

యనఁగా, క్షరమగు చతుర్వింశతి తత్త్వాత్మకమగు దేహమునకును, అట్టిదేహమునందుండెడు నక్షరుఁడగు జీవాత్మకును, విలక్షణుఁడగు వాఁ డనుటకు (15. 16-17)

కే, పురుషోత్తముఁడనియు నామాంతరము గల దనుటకు (15. 18)

పర్జన్యుఁడు—అన్నమును గలుగఁజేయు ననుటకు (3. 14)

యజ్ఞమువలనఁగలుగు ననుటకు (3. 14)

పవనుఁడు—(వాయువు) పరిశుద్ధవస్తువులలో భగవత్స్వరూపుఁ డనుటకు (10. 31)

పాపము—అనెడు మహాసముద్రమును దాటుటకు జ్ఞానము తెప్పవంటి దనుటకు (4. 36)

వలననే దేహేంద్రియాది వికారములును, గుణములును, గలుగుచున్నవను టకు (13. 20)

చేఁజేయఁబడు కార్యములయొక్క ఫలములగు సుఖదుఃఖములను పురుషుఁడగు జీవుఁడనుభవించు ననుటకు (13. 21-22)

యనెడు యోనియందుఁ బురుషుఁడనెడు పరమాత్మయొక్క బీజసంయోగము వలన సమస్తభూతము లుత్పన్నములగు ననుటకు (14. 34)

సంబంధమగు సత్త్వరజస్తమోగుణములు దేహస్థుఁడగు నాత్మను బంధించు ననుటకు (14. 5)

యందు సమస్తభూతములును గల్పాంతమున లయించును, మరలఁ గల్పాదియం దుత్పత్తియగుచుండు ననుటకు (9. 7)

ప్రకృతిగుణములచేఁ—బ్రతిపురుషుఁడును బ్రేరేపింపఁబడి యెప్పుడును గర్మలఁ జేయుచుండు ననుటకు (3. 5)

ప్రకృతిగుణము—లచేఁ గర్మ చేయఁబడుచుండఁగా, అహంకారయుక్తుఁడా కర్మను దనయందారోపించుకొనుచున్నాఁ డనుటకు (3. 27)

లచే మోహితులైనవారు గుణజన్యములగు కర్మలయం దాసక్తులగుచున్నా రనుటకు (3. 29)

ల వ్యాపారముల నెఱిఁగినవారు గుణకర్మలను దెలియని మూఢులనమ్మకమును జలింపఁజేయఁగూడ దనుటకు (3. 29)

లను నిగ్రహించుటకు సాధ్యపడ దనుటకు (3. 33)

లే, సమస్తకర్మలఁ జేయుచుండుననియు, తానాకర్మలకు సాక్షిభూతుఁడే గాని కర్తగాననియు నెవఁడెఱుఁగుచున్నాఁడో, అట్టివాఁడు పరబ్రహ్మస్వరూపుఁ డనుటకు (14. 19)

లకు లోఁబడనివాఁడు ముల్లోకంబులలో లే డనుటకు (18. 40)

లనుబట్టి చాతుర్వర్ణ్యముల వారికిని కర్మలు విభక్తములై యుండు ననుటకు (13. 41)

లచేఁ గర్మలన్నియు నవశముగానైనను జేయింపఁబడుచుండు ననుటకు (13.60)

ప్రకృతిపురుషులు—అనఁగా క్షేత్రక్షేత్రజ్ఞు లనుటకు (13. 19)

లు, అనాది, అనఁగా నిత్యము లనుటకు (13. 20)

లను, వానిగుణములను జక్కఁగ నెఱిఁగి ప్రవర్తించెడువానికిఁ బునర్జన్మలే దనుటకు (13. 24)

ల, సంయోగముచేతనే చరాచరాత్మకప్రపంచ ముత్పన్నమగుచున్న దనుటకు (13. 27)

ఆద్యంతములును—జననమరణాదులును—లేనివాఁ డనియు, సమస్తలోకములకు
నీశ్వరుఁ డనియు, నెవఁడెఱుఁగుచున్నాఁడో, అట్టివాఁడు మోహము
జెందఁ డనుటకు (10. 3)

సమస్తప్రాణులకు బుద్ధిజ్ఞానాదులనిచ్చు ననుటకు (10. 4. 5)

సమస్తభూతముల యుత్పత్తి స్థితిలయములకుఁ గారణభూతుఁ డనుటకు (10.20

సమస్తభూతములకును జీవస్వరూపుఁడనుటకు (10. 39)

భూమియం దావేశించి సమస్త భూతములను భరించుచు నాభూతసంరక్ష
ణార్థమై చంద్రునియం దావేశించి సమస్తసస్యములను వృద్ధిఁబొందింప
చున్నా డనుటకు (15. 13)

దేహమునం దావేశించి జఠరాగ్నిరూపమున, అన్నాదులను జీర్ణింపఁజేయు
చున్నాఁ డనుటకు (15. 4)

సమస్తప్రాణులయందంతర్యామిగానుండి స్మృతిజ్ఞానాపోహనాదులఁగలుగఁ
జేయుననుటకు (15. 15)

వేదవేదాంతములను జేసినవాఁడును, వాని నెఱిఁగినవాఁడును, వానిచే
నెఱుఁగఁబడదగిన వాఁడుననుటకు (15. 15)

సకలప్రాణుల హృదయములయందున్నవాఁడై, యంత్రగాఁడు బొమ్మల
నాడించినట్లాడించుచుండు ననుటకు (18. 61)

భగవంతుఁడే—సమస్తభూతస్థమగు జీవాత్మయనుటకు (10. 20)

భగవంతుని—నారాధించెడువారు భగవంతునే యాశ్రయింతురు గాని యన్యదేవతల
నాశ్రయింప రనుటకు (7. 23)

బొందినవారికిఁ బునర్జన్మము లే దనుటకు (15. 16)

సాత్త్వికస్వభావముగల మహాత్ము లితరచింతలేక భజింతురనుటకు (9. 13)

దృఢవ్రతులగు మహాత్ము లెడతెగని సమాధి చింతనముగలవారై సదా
స్మరింతు రనుటకు (9. 14)

కొందఱు వాసుదేవస్సర్వమనెడు జ్ఞానయజ్ఞముచే భజింతురనుటకు (9. 15)

కొందఱు సర్వము పరబ్రహ్మస్వరూపమనెడు నద్వైతభావముచేత భజింతు
రనుటకు (9. 15)

అనన్యగతికులై యుపాసించెడు వారి యోగక్షేమముల నాభగవంతుఁడే
వహించు ననుటకు (9. 22)

ఆరాధించువారు భగవంతునే పొందుదు రనుటకు (9. 25)

సమస్తవిధముల శరణుబొందినవానికిఁ జిత్తశాంతియు, మోక్షమును, గలుగు
ననుటకు (18. 62)

మునులలో—వేదవ్యాసుఁడు భగవత్స్వరూపుఁ డనుటకు (10. 37)

ముముక్షువులగు—పూర్వులు కర్మ భగవంతుని నంటనేరదని తెలిసికొనినవారును, అనాసక్త చిత్తులునై కర్మ నాచరించి రనుటకు (4. 15)

మూఢులు—మాయచేఁ గప్పఁబడిన జ్ఞానముగలవారై భగవంతుని గనజాల రనుటకు (7. 15)

యోగమాయచేఁగప్పఁబడియుండెడు భగవంతుని దెలిసికొనఁజాల రనుటకు (7. 25)

అవతారపురుషుఁడగు భగవంతుని దెలిసికొనఁజాలక, సామాన్యమనుష్యునిగా నెంచి యలక్ష్యము సేయుదు రనుటకు (9. 11)

ప్రకృతి మోహితులును, ఆశాపాశబద్ధులునై వ్యర్థమైన కర్మానుష్ఠానముగల వారుగను, వ్యర్థమైన జ్ఞానముగలవారుగను, ఉందు రనుటకు (9. 12)

మృగములలో—సింహము భగవత్స్వరూప మనుటకు (10. 30)

మృత్యువు—భగవత్స్వరూపమనుటకు (10. 31)

మేరువు—శిఖరులలో భగవత్స్వరూప మనుటకు (10. 23)

మోక్షము—జ్ఞానముచే నశింపఁజేయఁబడిన పాపముగలవారలకుఁగలుగు ననుటకు (5. 17)

కొఱకు నెవరైతే భగవంతుని నాశ్రయింపుచున్నారో, అట్టివారాభగవంతుని బ్రహ్మగాను - కర్మగాను - అధ్యాత్మగాను — అధిభూతముగాను _ అధిదైవముగాను - అధియజ్ఞముగాను _ నెఱుఁగుదు రనుటకు (7. 29. 30)

యక్షరాక్షసులలో—కుబేరుఁడు భగవత్స్వరూపుఁ డనుటకు (10. 23)

యజ్ఞము—కొఱకుఁగాక యన్యముగాఁ జేయఁబడు కర్మ, చేయువానిని బద్ధునిజేయు ననుటకు (3. 9)

ప్రజలతోఁగూడ సృజింపఁబడిన దనుటకు (3. 10)

చే, ప్రజ లిష్టావాప్తులనొంది వృద్ధిఁబొందుదు రనుటకు (3. 10)

చే, పూజింపఁబడిన దేవత లిష్టభోగముల నిత్తు రనుటకు (3. 12)

యజ్ఞము—చేయఁగా మిగిలిన యన్నమును (యజ్ఞశేషమును) భుజించినవారు కిల్బిష రహితులగుదు రనుటకు (3. 13)

కొఱకుఁగాక యాత్మార్థముగా వండి తినెడువాడు పాపాత్ముఁడనుటకు(3.13

వలనఁ బర్జన్యుఁడు గలుగు ననుటకు (3. 14)

కర్మమువలనఁగలుగు ననుటకు (3. 14)

కొఱకు, అనఁగా, భగవదారాధనకొఱకు ఫలాసక్తిలేక చేయఁబడు కర్మ మంటనేర దనుటకు (4. 23)

ఏకాగ్రచిత్తముతో నభ్యసింపవలయు ననుటకు (6. 12)

తననాసికాగ్రమున దృష్టినినిలిపి దిక్కులుచూడకుండవలయు ననుటకు (6.13)

శాంతచిత్తుఁడై బ్రహ్మచారి వ్రతముగలవాఁడై యుండవలయు ననుటకు(6.14)

అమితముగా భుజింపఁగూడ దనుటకు (6. 16)

బొత్తిగా భుజింపకుండఁగూడ దనుటకు (6. 16)

విశేషముగా నిద్రింపఁగూడ దనుటకు (6. 16)

విశేషముగా మేల్కొనియుండఁగూడ దనుటకు (6. 16)

మితముగా భుజింపవలయు ననుటకు (1 17)

మితముగా వ్యాయామముగలవాఁడై యుండవలయు ననుటకు (6. 17)

మితముగా నిద్రింపవలయు ననుటకు (6. 17)

మితముగా మేలుకొనియుండవలయు ననుటకు (6. 17)

ఎప్పుడు యోగసిద్ధిని బొందినవాఁడగుచున్నాఁ డనుటకు (6. 20-21-22-23)

తనమనస్సును యోగమునందెల్లలవఱపవలయు ననుటకు (6. 24-25-26-27-28)

యోగి—యొక్క మనస్సు నివాతస్థదీపమువలెఁ జలింపకుండవలయు ననుటకు (6. 19)

ప్రపంచమంతయు భగవత్స్వరూపమని యెఱుఁగు ననుటకు (6. 30)

భగవంతుని సమస్తభూతములయందు వ్యాపించియున్న వానిఁగాఁ దెలిసికొని భజించు ననుటకు (6 31)

సమస్తప్రాణులయొక్క సుఖదుఃఖములవంటివే యని యెంచు ననుటకు(6.32)

తపస్వులకంటెను, జ్ఞానులకంటెను, శ్రేష్ఠుఁ డనుటకు (6. 46)

కంటె భగవంతునియెడల నంతరంగభక్తిగలిగి సేవించువాఁడు శ్రేష్ఠుఁ డనుటకు (6. 47)

వేదములయందును యజ్ఞములయందును తపస్సులయందును, జెప్పియుండెడు ఫలములకంటె శ్రేష్ఠమైనఫలమగు మోక్షమునకుఁ బ్రయత్నముచేసి పొందుచున్నాఁ డనుటకు (8. 28)

సుకృతదుష్కృతములను రెంటిని నీలోకమునందే విడిచిపెట్టి పోవుచున్నాఁ డనుటకు (2. 50-51)

పామరు లాసక్తితోఁ బ్రవర్తించు విషయములలోఁ దా ననాసక్తుఁడుగను, వారల నాసక్తితోఁ బ్రవర్తించు విషయములలోఁ దా నాసక్తుఁడుగను నుండు ననుటకు (2. 69)

యొక్క మనసు సముద్రమువంటిదనుటకు (2. 70)

కర్మయోగము నవలంబింప వలయు ననుటకు (3. 3)

